# బసవేశ్వర కళ్యాణము





గ్రంథకర్త:

బాలకవి, కట్టి భీమలింగాచారి,

నరసన్నపేట.



పబ్లిషర్సు:

రామా అండ్ కో.,

హెడ్డాఫీసు: ఏలూరు.

బ్రాంచెస్:—రాజమండ్రి, గుంటూరు, భీమవరం.

 [వెల 1—0—0

కవికిశోరమా! నీవనంతరము వ్రాయఁబూను రచనలయందు గ్రంథ చౌర్య మను కళంకమును దెచ్చుకొనక నీసామర్థ్యమును బట్టియే క్రొత్త క్రొత్త పోకడలను నిర్మించుకొని ఖ్యాతినిగడించి చిరకాలము లోకోపకార కావ్యముల నిర్మించుచు నాయురారోగ్యములను పరమేశ్వర కృపచే గడించుకొందువుగాక యని నాయాశీర్వాదము.

కం. భద్ర ప్రక్రియఁజక్కఁగ, రుద్రశ్రీ ఋక్షమాల నిరూఢపరచి యా
రుద్రుని కృపఁగాంచితి విల, రుద్రకవి సమానకీర్తి నిరూఢిగ ననుమా.

ఇట్లాశీర్వదించు
సం॥ క్రొత్తపల్లి సుందరరామయ్య
లక్ష్యవరాస్థాన విద్వాంసుడు
సహస్రాధిక గ్రంథకర్త

కవినాథ విలాసము
ఏలూరు
16—2—48

## బసవేశ్వర కళ్యాణ కృతిప్రశంస

ఒకప్పుడు "పార్వతీశ్వరనక్షత్రమాల" అనుసముద్రితప్రతిని బ్రహ్మశ్రీ కట్టి గంగరాజు ఆచార్యులుగారు మన చిరంజీవి భీమలింగాచార్య పితృపాదులు నాచేతి కిచ్చిరి. చదివితిని. పూర్వకవిత్వ శైలిలోనున్నది. కవిని జూడనాహృదయము తొందరించినది. మీవానినెప్పుడు నాకుఁ జూపింతురో? చూడవలెనని మిక్కిలి కుతూహలముగా నున్నది. పొగడికకాదు మాక్షుద్రకవిని దలపించుచున్నాఁ డంటిని.

నేఁడు కవినిఁ జూచితిని. ఇఱువది వత్సరముల లేఁబ్రాయము. కవిముఖమునఁ బసవేశ్వరకళ్యాణ కృతినివింటిని.

గాడిరీతితో ద్రాక్షాపాకమును నారికేళపాకమునుగాని పాకములో శృంగార రసతరంగములలో బహ్వలంకార భూయిష్ఠమై కావ్యగుణములతో నేకాశ్వాస మైనను మిక్కిలి యానందింపఁజేసినది.

శా. సుక్షేత్రమ్మగు భీమలింగకవి హృత్క్షోణిన్ రసానందవా
గ్ధార్క్షా బిజమొసత్కవిత్వలతికారామంబుగాఁ బ్రతిభా
విక్షేపంబుగనే పుగాంచుఫలసంవిస్తీర్ణసంపూర్ణమై
దీక్షన్ వర్ధిలు భద్రరుద్రపదభక్తిప్రావృడాహ్లాదియై.

శ్రీధన్వంతరి కళాశ్రమమ్
ఏలూరు
ది. 18—2—48

ఇట్లు
వైద్యావధాని, కవిరాజ, కవితావిశారద
సం॥ కందుకూరి వేంకట సుబ్బారావు.

ముద్రణాక్రియావతారిక

వ. ఇల నరసన్నపేట వెల§యించిరి శైవసమాజమంచును
జ్వాలముగఁ గంఠఁంబిన గ§జాధవలింగ నిరంతరార్చనా
త్యాలఘువివేక చిత్తులన§య ప్రతిపాదిత ధర్మకర్మదో
హాలమతులై తదీయనగ § రాంతరభాస్కర వారపేటలో. 1

ఉ. అంచితపూతభక్తి బస § వాఖ్య నొకానొక మండపంబుని
ర్మించిరి శైవభక్తివివ § రించిరి కీర్తిలతామతల్లి సా
రించిరి దీనపాళినల § రించిరి భక్తగణార్చనామహో
దంచిత సత్క్రియావిలసి § తాత్మకులై నెగడొందుచుం ధరన్. 2

ఉ. సూరిరవీంద్ర సంచయ వ § చోముదితాత్మకు లప్పవిత్రసం
ఘోరితభక్త చంద్రములన § యోద్ధ కవిత్వకళా విలోలులై
వారక నాకొసంగిరి సు § వర్ణపతాక మదల్పవాక్యవి
స్ఫారముపాత్ములై యదియె § వారి యశోగ్రహారత్న దీపమా. 3

ఉ. అందున సంతతేశ చర § ణాంబుజయుగ్మ సమర్చనామహా
సందుఁడు గోరు సత్తులము § నన్ ప్రభవించిన "ముల్లయాఖ్యు"ఁడ
స్పంద దయామృతాది గుణ § భద్రుని భద్రయ నామధేయుఁద
త్సుందరి యందుగాంచెఁ బరి § శోభితలీలఁ దృతీయపుత్త్రిగాన్. 4

కం. అతిపుణ్యుండా బాలుఁడు § సతతోజ్జ్వల కీర్తిలాలసక్రియనస్మ
త్కృతిముద్రితమై తగుస § ద్గతిహృద్వీథిందలంపఁ గడఁగెడి నంతన్. 5

సీ. అభవపూజాధుర్యు § డగు కన్నయసుతుండు § చల్లాబసవరాజు § సద్గుణుండు
ననమానకీర్తి దా § లప్పన్నపుత్త్రుండు మొనుకోటిచిన్నయ్య § యనెడి సుగుణి
రామలింగము పుత్త్రి § రత్నంబుకొండక సూర్యనారాయణ § సుభగవర్తి
అతివదాన్యుఁడు కట్టి § అప్పన్నసుకుమారుఁడైన కాశీపతి § యలఘు శిల్పి
విలసద్గుణాఢ్యుఁడౌ § వేంకటప్పయ సుతుం డద్దాదగన్నాథ § మనెడిదాత
చిట్టూరికుల భవ § శ్రీష్ముఁడౌ పాపన్నసుతుఁడు వీరాస్వామి § వితతగుణుడు
నలపంక్తి కోళ్ళన § ల్లయసత్కుమారుఁడౌ గణపతిరావాది § గానుభక్తు
గీ. లలరితగురీతి ధనసహా § యంబుజేసి యీకృతిం బ్రీతినచ్చు వేయించినారు
కర్మశూరులు ధీవరుల్ § ధర్మరతులు నిర్మలయశోవిలోలురు § శాక్మకులును. 6

ఉ. అందఱి కందఱున్ వరగు § ణాకరు లిద్ధ చరిత్రులుర్వి నె
న్నందగువారు వీరిఁ గరు § ణానిధిమత్కృతినాథుఁడీశుఁడ
స్పందమహోరర్ధశుభ § శాలురగా నొనరించియాసవి
త్రిందుగ వీరికీర్తి వెల § యించెడిగాతజగత్త్రయంబునన్. 7

ఇట్లు
కట్టి భీమలింగాచారి
గ్రంథకర్త



ఓం.

శివాయనమః.

# బసవేశ్వరకళ్యాణము

# ఏకాశ్వాసప్రబంధము

ఇష్టదేవతాస్తుతి.



మద్గావభవాస్తనాహితకరో § త్సేకంబిలాభృద్ధనుః
ప్రామాణ్యంబు ఘటింపఁ జక్రిచికుర § ప్రాంచత్కరాబిందిరా
స్వామిన్యుస్థితిఁ దెల్పఁ దత్ప్రకృతియూ § పణ్ హాళిఁ దేలించునా
వ్యోమాట త్రిపురారి మత్కృతి జగ § త్పూర్ణంబుఁ గావించుతన్.

శా. శ్రీమచ్ఛంకరదారుకావనముని § శ్రేణ్యంగనాఖేటకా
ర్యామర్షాప్తి వనోధినేత్రకమన § వ్యాపారమీక్షింపఁద
ద్వామాంగంబున డాఁగె నోయనువిధిన్ § వర్తించు శైలాత్మజా
ప్రేమస్విన్న కటాక్షమిచ్చు నతుల § శ్రేయోఘనారోగ్యముల్. 2

సీ. చక్రియయ్యు సమస్త § చక్రిలోక విపక్ష, పక్షి నాథునిఁ గింకరుఁ బఱచినవాఁడు
విధుఁడయ్యుఁ జక్రసంభృతకరుండై యహీ, నారిశీర్షచ్ఛేది § యైనవాఁడు
హరియయ్యు శేషాశ § నాధీశ భోగభా, గాభోగ భాగంబుఁ § డైనవాఁడుఁ
బురుషోత్తముండయ్యు § భూరిదైత్యాంతకుండై బుభూత్కారసేవకులందువాఁడు

గీ. శర్వమార్గణుఁడయ్యున § శ్రాంతశర్వ మార్గణాయిల కార్యని § ర్మగ్నచిత్తుఁ
డైన చిత్రాభిధానుఁడ § బ్జాలయేశుఁ, డిచ్చునను కంప మామకా § భీష్టవితతి.

కం. కమలాంబకు భార్యామణిఁ, గమలాంబకుఁ గన్నతల్లిఁ § గమలాగారణ్
గమలాంబికఁ గమలాంబికఁ, గమలాంబిక మామకాత్మ § కమలముఁ జేర్తున్. 4

చ. అతులితపంచ వేదముల § యందొక వేదము కానరాదటం
చతులితపంచ వక్త్రముల § యందొక వక్త్రముఁ బాసెనోయనన్
ప్రతిభను నాగమాస్యుఁడయి § భాసిలుచుండు చతుర్ముఖుండుసం
చితకరుణా విశృష్టమృదు § చిత్తతనిచ్చుఁ జిరాయురున్నతుల్, 5

మ. ప్రతివల్కన్ స్ఫురమాణ కోపవగుచున్ § బర్వైతిధాత్రీకవీ
ట్త్రి వక్త్రాలయపాళి దాఁగెదవుగా § రంజింప నెట్టోయనన్
చతురాస్యుండవు నీకు నేర్పవలెనా § చాతుర్యమంచున్ మనః
పతితో నర్మములాడు వాక్పతిసువా § క్ప్రాగల్భ్యమిచ్చుం గృపన్. 6

శా. చండీ శాసితకంఠ మూలఫణి రా § ట్సాంఘాతసందర్శనో
చ్చండత్రాస విధాచరన్నిజ వృశా § శ్వ శ్రేష్ఠముల్ హేలగా
శుండా భీలవిఘట్టన స్ఫుటిత భూ § సోపాన గూఢక్రియో
ద్దండా నందము నందఁజేయు ఘనునిన్ § ధ్యానింతు నాగాననున్. 7

శా. విద్యాసాగర నిమ్నగర్భ మృగసం § వితోత్కల సంచారణ
ప్రోద్యత్కేళి సమాప్త శబ్దమణి త § త్యుల్లేఖ నాసక్త్రియా
హృద్య ప్రాభవ సత్ప్రబంధములనె § న్నేభూమికల్పించున
య్యాద్యుత్కృష్ట కవీంద్ర సాంద్రధిషణా § వ్యావృత్తిఁ గొండాడెదన్. 8

శా. ప్రావృట్కాల వినీల నీరధరధా § రాసారనీకాశవి
శ్రావామేయ కవిత్వతత్త్వలహరీ § స్థానాయ మానాస్యస
ద్భావాత్మున్ రఘురామ సచ్చరిత వ § క్తన్ గట్టివం శోద్భవున్
భావింతున్ ద్విజచంద్రు మద్గురుని సు § బ్రహ్మణ్య సూరీశ్వరున్. 9

కం. అతులిత కవితాచంగున్, శ్రుతిసూక్త మనోజ్ఞ ధర్మ § సూచితమార్గ
స్థిత నిర్మలాంతరంగ, వ్రతునిన్ శ్రీకట్టి గంగ § రాజుం దలఁతున్. 10

వ. ఇవ్విధంబునఁ బ్రార్థనీయ సంస్మరణాభి రతుండనై తజ్జన కృపాకటాక్ష
లబ్ధి నద్దియే నొక్క పవిత్ర చరిత్ర రచింప సమకట్టుటయు. 11

సీ. శ్రీమత్త్రికాలవి § శ్వేశలింగార్చనా పారవశ్యమనోవి § భాసురుండుఁ
గావ్యశైవ పురాణ కాండసారార్థ సంబోధ నాధిషణావి § భూషితుండు
లసమాన కవితావి § లాసతోషిత మహీభృ ద్రాడపుత్త్రికా § ప్రియ వరుండు
నగరీజన ప్రతాన ప్రశంసా పాత్రవరవచో ధోరణీ § వైభవుండు

గీ. ఆదివన్నెకులాబ్ధి పూర్ణామృతాంశుఁడైన గురుపాదయాఖ్య వైద్యప్రవరుఁడు
జంగ మాన్వయవర్యుఁడ § స్మన్మహోపు రోభివృద్ధ్యర్థి వచ్చియి § ట్లనియెఁ బ్రీతి. 12

చ. విడివిడి పద్దెముల్ పుడమి వేనకు వేలు రచింపనేమివ
చ్చెడిని యశంబుగానఁ బ్రవిశిష్టమహేశ చరిత్ర వార్ధిలో
నడరు కథా పవిత్రమణి యావన నొక్క కథం బ్రబంధమే
ర్పడఁగ రచించి సత్కవి వర ప్రతతిన్ ఘనకీర్తిఁ గాంచుమా. 13

ఉ. పాండితిలేదు కావ్యపరిపాటి నెఱుంగను గల్పనాసమ
ర్థుండనుగానటంచు మదిలో, దలఁపోయకు మెవ్వఁడేపమ
ర్థుండ నటంచుఁ జేయు నొకొ రూఢిగఁ దద్ధిషణాస్థ సారుతా
ఖుండును గార్యముల్ కనుక నొక్కకథన్ విరచింపు మంచుఁదాన్. 14

చ. అసమ దయాతిరేక విభవాకృతి నీవిధిఁ బ్రోత్సహింపసం
తసమును గార్యదీక్ష మతి తామరనిండఁగఁ దత్క్షణంబునన్
బసవపురాణ ప్రోక్తబసవన్న వివాహము వ్రాయనెంచియు
ల్లసనము మీఱ మద్వరకుల క్రమవర్ణన సేతు నిచ్ఛమై. 15

కవివంశాభివర్ణనము

గీ. ఆదినిసశివిష్ణుపద్మాసనాది కామరంబైన వేళస్వయంప్రకాశ
తాతితేజోధనుండుపం చాననములఁ శివిరాడ్విశ్వకర్మ భాసిల్లెఁగరము. 16
క. మనువును మయుండుత్వష్టయు వినుతప్రఖ్యాతశిల్పివిశ్వజ్ఞుండున్
ఘనశేము పితత్వంచాననములజనియించిరందునన్ విమలుండై 17
కం. నెగడొందుత్వష్ట్రుసంతతి జగతీత్రయమున సమాన సదములచర్యా
ప్రగణిత సమ్యక్కీర్తిం బొగడొంకొనునుండనందు భూరిమనీషుల్. 18
సీ. ఆదిత్యసేనుం గార్యాంతగోతులా దివ్యతేజస్కులా దిత్యభోగు
లసమానశిల్ప విద్యానల్పమేధావి ధ్యానభావితమహా తతయశస్కు
లర్థిసంచయపోష ణార్థిస్వాంతార్థు లాగమాంతజ్ఞాతు లలఘుగుణులు
నిత్యసత్యవచోవి నీతప్రవర్తన ఖ్యాతులన్వర్థజా యావిదూరు
గీ. లగుచు కొందఱు నాకలోకాధ్వనీను, లైనపిమ్మటఁ గత్తివంశాబ్ధిపూర్ణ
చంద్రుఁ డనవొప్పె నప్పలాచార్య నాముఁ డన్వవాయాభిరాము డత్యంతసుకృతి
కం. ఆపుణ్యాత్ముఁడు సుగుణ, వ్యాపారాపార పారవశ్యుఁడు ధైర్యా
కూపారసార వాశ్న మితా, పాయనికాయనామకాగ్ని శిఖుండై. 20
గీ. అప్పనాఖ్యుని నీలకంఠాఖ్య నాయుఁ, డను గుణిని భీమకాళన్న లనెడివారి
నవ్విరాడ్విశ్వకర్మ పంచాత్మజులను, గన్న రీతిని పుత్రుల గాంచెనిలను. 21
గీ. ఆసహోదర పంచకం బందు నిరత, ఘన విభూతిని యా నీలకంఠుఁ డనఁగ
నీల కంఠాభిధానుఁ డుసాంద్రసద్గుణ, ప్రకీర్తిత సర్వమానవుఁడు నొచు. 22
సీ. శోభిల్లి నరసింహు సూర్యనారాయణ వెంకన్న యను నిష్కళంక చరిత
నవఘు వీరేశలింగాభిధాన ని గంగరాజాఖ్య నయధర్మ ప్రవర్తి
ననురక్తచిత్తయా నప్పలాంబావధూ రత్నంబునందు పుత్రికుల గాంచె
నాపంచకంబులో నలరు కనిష్ఠుడౌ గంగరాజు కవిత్వ చంగుడఁగుచు
గీ. సుగుణ సంపత్తి విబుధ సంస్తుతులనంది, కాంతుసేవను బార్వతీకాంతబోలు
పార్వతీ కంజనేత్రి నుద్వాహమాడి, శ్రేష్ఠగార్హస్థ్యధర్మంబు స్వీకరించి. 23
సీ. నీలకంఠాచార్య నిరవద్య గుణధుర్యు బుణ్యుసుబ్బారావు పురుషగణ్యు
వమలేందుముఖి వరహాలమ్మ యనుసాధ్వి కవితారసాన యాంత్రాంతునన్ను
తతసుబాలక సఖ్యతారక బ్రహ్మాఖ్య శేషాప్పలమ్మలన్ శిష్ట బాలి
కా రత్నములఁ గాంచి కడువైభవము మీఱ వీరేశలింగాఖ్య విమలమతికి

గీ. నగ్రజాతునకర్థి దత్తాత్మజాతు గానొనర్పఁగ విభవంబు గడలుకొనఁగ
చిట్టెమాంబా వధూటి పోషింపఁ బెరిగి యీ ప్రబంధంబు జెప్పఁగా నిపుడు కడఁగి

షష్ట్యంతములు

కం. తారాపథకేశునకుం దారాద్రినివేశునకును దారాంభోజా
తారాతికంబుకరకాం తారామృత చంద్రికాశ తారాభునకున్. 25

కం. నాకపురానీకదరా స్తోకకరాఖర్వగర్వధూర్వహదైత్యా
నూకవరానీకహరో ద్రేకనిరాలోక భీమదివ్యాస్త్రునకున్. 26

కం. మందరధరకందరవర సుందరతర మందిరునకు సుగ్రీవజితేం
దిందిర కరకంధరపౌ రందరమణిసామజేంది రావరఘృణికిన్. 27

కం. కుధరకుమార్యధరలస న్మధురసుధామోదదైవ తతిరాజునకున్
విధిరమణీహీరమణీ విధరమణీయాంగసైత్య విభ్రాజునకున్. 28

కం. వామాశ్రితవామాశ్రిత వామాతత దేహవైభవస్ఫారునకున్
శ్యామాకరధామాకర ధూమాంక ప్రథితనేత్ర ధూర్ధారునకున్. 29

కం. కుంభీనసగంభీరసు శుంభీకరణక్రియావి శుద్ధోన్మధనా
రంభోజ్జ్వలదంభోనిధి సంభూతక్ష్వేళదంభ సంస్తంభునకున్. 30

కం. చామీకరభూమీధర ధామీకరణానుమోద దైవతవరపౌ
లోమీవరనేమీకర ణామానుష వీర్యజిత్పు రాధీశునకున్. 31

కం. రక్షోజనవక్షోనిక రక్షోదవిదక్షరూక్ష రంగచ్ఛితశూ
లాక్షరహార్యక్షుబుబు క్షూక్షితగంధేభరాక్ష సప్రభువునకున్. 32

కం. ఇంద్రోపేంద్రమునీంద్రమహేంద్రునకున్ భక్తచంద్రహేలాకరుణా
సాంద్రునకున్ సితభూభృత్కేంద్రునకున్ భువనభరణ ధీరుంద్రునకున్. 33

వ. ప్రణామపూర్వకంబుగా నర్పింపంబూనునేతద్బసవేశ్వరకళ్యాణంబను నేకా
శ్వాస ప్రబంధమునకుం గథావిధానం బెట్టిదనిన. 34

కథాప్రారంభము

ఉ. ముద్రితనూత్నరత్ననవమోహనహాటక సౌధకుడ్యని
ర్ణిద్ర మరీచివిస్ఫురిత లేఖవధూరమణీయసత్తటి
దృద్రదళరీరదృక్ప్రకీత భవ్యమనస్క దిహాటనౌఘము
క్షుద్రగిరీశ భక్తపరిశోభితవైభవమై తనర్చుచున్. 35

గీ. పరఁగుఁగర్ణాటమున బిజాపురమమేయ వైభవోపేతమనయుదీవ్యద్ఘనాఘ
నావలీ స్పర్శ సార్ద్రీకృతాచ్ఛసౌధ ముఖ్యభిత్తిక మాచుని భూతలమున. 36

సీ. భృగుమునీశ్వర పదాభిలఘట్టన ఆోమ్మమ్మవాయ విష్ణునురంబు వాసిలక్ష్మి
యేతత్పురీ వైభవేక్షాము దోత్కంఠ నిశ్చలంబుగ నిందె నిల్చెఁబోలుఁ
బుత్త్రికా రత్నాప్రపూరి తాకాయుక్తి సంభోధి పరిఖయై యలరెఁబోలు
లక్ష్మి నన్వేషింపలక్ష్మీశుఁ డంపఁజక్రంబుఁ బూసాలమై ప్రాకెఁబోలుఁ

గీ. గాకయుండిన దార చక్రములు లేకఁ బరశురామావతారావసరమునందు
రాజవర్గ నిబర్హణ వ్యాజమునను వారి రోయుంగ నిల కేల వచ్చు శౌరి. 37

ఉ. పూరితనాగలోకమగు పూఃపరిఖాంబు వివరసక్తభా
మారణపక్షిసాల తరుశాఖసముగ్రసుపర్ణ పర్ణసం
స్మారిత భీతిమై వివరసంచయ మార్గవసత్సమిద్ధర
తారతి నూఁగ గాదె ఫణికాండము దాల్చి బిలేశయాభిధన్. 38

శా. ఆదిక్రోడ బృహద్విషాణముఖనిర్యద్రత్న సందోహమి
మ్మేదిన్యంతర రత్నసమ్మిళితమై మేర్వాదితో దాయగాఁ
బ్రాదుర్భావము నొందెఁబోలు నగరీప్రాకార దివ్యాకృతిన్
గాదేఁ గల్గు నెనాకచుంబివరణాకారీ భవద్రత్నముల్. 39

సీ. నిరవద్య శోభావినీత దర్పణ కదంబక భాముఖేందు చంద్రికలు గాఁగ
శాతమస్య వమణీస్ఫార దీధితి విలాసంబు వేణీభరచ్ఛాయగాఁగఁ
బద్మరాగచ్ఛటా ప్రాగంశు సందీప్తి రమణీయ శోణాధరంబుగాఁగఁ
దతవజ్రరత్న ప్రతాన నానాకళా విలసనంబులు రదావళులుగాఁగ
గీ. మహితగోమేధికాది కామల మణిప్రభా సమూహము కర్బురాంబరముగాఁగ
నతులరోదోంతరంబు గేహంబుగాఁగ వఱలుఁ దత్పట్టణోత్సేధ వరణలక్ష్మి. 40

శా. ఛాయస్సాల వికీర్యమాణ మణిభాప్రోద్భూత యాతాయన
చ్ఛాయాదృష్టి నతిక్రమభ్రమ జగచ్చతూరధార్వాలస
వ్యాయామాభి నిదానతాజ్ఞత నియంతాఘాతముల్ గూర్చుచో
నా యక్కుండడదలించుఁ దన్నిజనిదానార్థంబు బోధించుచున్. 41

శా. ప్రాసాదాగ్రచరత్కుమారకతనూరాజత్కళా ప్రీతిణో
ల్లాసస్వాంత వియచ్చరాబ్జనయనల్ తద్రాజితోడన్ సుమే
ష్వాస క్రీడఁ బెనంగి నారమొదవన్ సాధించి తాబ్జామృతం
బాసంగ్రోలి సురత్వసిద్ధి నతులాహ్లాదంబుఁ గాంతుర్వెసన్ 42

ఉ. వేడుకరేల సోహొరయు వీథుల సౌధముల న్నెలంగుఁ బూఁ
బోఁడుల నీలకేశచయముల్ ముదిరాళిగ హారపాళి చి
త్రోడులుగా ముఖంబులఖరోస్రులుగాఁ గనుపింపఁ బౌరు ల
ట్టాడుచునుందు రందు సహజామృత భాను నెఱుంగఁ జాలమిన్. 43

ఉ. ఆగమ విద్యనేర్చుకొను సర్వభుజుండొను విధాత కానిచో
భోగి శయానుఁ దద్గురు విభూతినిఁ గోరున సోమకాసురుం
డాగమముల్ హరింప నను చాగమపుంజ రహస్య వర్తితా
భోగవచస్కుల న్నగరి భూసురు లవ్విధి మెచ్చరెంతయున్. 44

కం. సంతత భద్రోపేతుల, నంతగుణుల్ దేవతాలయాచల శర్మా
క్రాంతులు తన్నగరీ రత్నాంతర్వర రాజశేఖరావళి కొల్లన్. 45

కం. ధనపతియయ్యుఁ గుబేరుఁడు తన రోగంబుపశమింపఁ । దలఁపఁడు లోభం
బున ననిపల్కుచు వైశ్యులు ధన ధాన్యారోగ్య భాగ్య । తతిమించురిలన్. 46

మ. కనకవ్రీటి కిరాటకోటులెపుడేఁ । గాంక్షించి పౌర్గిండ్లకున్
జనుచో బమ్మెరపోవు చుండ్రు దిన మా । ర్జాలంబు లట్లన్ సతం
బనవద్యాయుత మిత్రజైత్రవర ర । త్నానీక దివ్య ప్రభా
కనవాత్యాయకాంతిమిత్రనిజ దృ । క్కంజాత లౌటంగడున్. 47

ఉ. ఆపురికాఁపు లేపు మెఱ । యన్ బహుసస్యసమూహము లాస్యవశ్యమై
చూప నిరంతరోర్వీజన । శోభ విభాసిల ధాన్యరాశి వి
ద్యాపరతన్ ఘటించి సము । దంచిత సన్నుతిఁ గాంతురెప్పు డ
క్షాఁపులెగా ధరాజనని । కాంచిన కాంచనగర్భిగర్భకుల్. 48

సీ. వడిఁ బాదమెత్తభూవలయంబు గ్రుంగునో యంచుమహాంధ్యముఁదాల్చునట్టికరులుఁ
బూర్ణ వేగముఁ జూపభూమి చాలదటంచు నుచితవేగముజూపుననురుహయములు
సరణినిక్షింపఁ బు । ష్పకవిమాన భ్రాంతివైయచ్చరంబైన । వరరథములు
నెదురనిల్వఁగఁ జాలు । నిర్ధశత్రులు లేమిఁ బల్మిలోన నడంచుఁ బటుభటాలి
గీ. విమలదరహాసకౌముదీ । వీక్షిత ప్రజా మనోబ్జంబు లుద్భగ్న । సరవిఁ బూను
నంచు నిల్వఁటనట్టి కన్యాజనంబుఁ గల్గు నిప్పురి వర్ణింపఁ గాఁ దరంబె. 49

కం. ఏతాదృగ్గుణ విశ్రుత, చాతుర్వర్ణ్య ప్రపూర్ణ । సంగతి యావ
ద్భూతల విస్తృత సమ్య క్ఖ్యాతిగ నన్నగరరాజ । మలరుచు నుండున్. 50

గీ. ఏతదాభూతలఖ్యాత । పూతనగర
మధ్యభాగప్రదీప్త సం । పత్కమగుచు
హింగుళేశ్వరభార్గవా । టీద్ధనామ
శాగ్రహారంబు వెల్గు భూ । హారమనఁగ. 51

సీ. ఆసారవిమలధా । రాసారమధుమిళత్కాసారపరివద్వి । భాసురంబు
మల్లికాగోస్తనీ । వల్లికాదిలతామతల్లికాపూర్ణ సుం । దరవనంబు
నాళీకకల్హార । పాళీకనత్కైర, వాళీకలాపాళి । శాపగంబు
శ్రీకంఠపదసేవ । నాకంఠహేలా నధూకంఠగానమా । ధుర్యధుర్య
గీ. రవసమాకీర్ణ శంకరా । లయవిభంబు శివకథాయూథ బోధనా । శేషశివ
ర ప్రపతానక మండప । వ్రాతమగుచు నలరు నిత్యంబును దదగ్ర । హారవరము. 52

ఉ. ఆ మహితాగ్రహార వర । మందున విప్రకులాబ్ధి పూర్ణిమా
సోముఁడు సోమలింగపరి । శోభిత దివ్యదురఃపుటుండు ని
త్యామలజంగమేంద్ర చర । ణాంబుజయుగ్మసమర్చనావ్రతో
ద్దాముఁడు గల్గునొక్కగుణ । ధాముఁడు మండెగ మాదిరాజనన్. 53

సీ. జ్యోతిస్స్వరూప వి । శ్రుతలింగసేవనాకార్యనిర్మగ్నమా । ట్యాలికుంధు
జంగమేశ్వరపదా । ర్చానిరంతదంబు సంకాళితాణలశిరః । కలుమందు

మధ్రసోపేత వివిధ శాకాన్న సంతర్పణానూన ముదిత యాచకాళి
సద్భోజనామనీషావిశేషస్ఫూర్తి సర్వాగమజ్ఞాత శ్రైష్ఠ్యకుండు
గీ. నిత్య సత్యప్రవర్తనా నిర్మితపూత చిత్తవృత్తిక్రియా సాధికోత్తమ ప్ర
జాకదంబక సౌహృద స్ఫారయశుఁడు మహిత విప్రాగ్రగణ్యుఁడమ్మాదిరాజు
ఉ. చండనిదాఘవేళ నలసారసమిశ్రితకరాళి నాపగా
కాండము లెండకున్కి సురకాండము లచ్చెరువంది రోసి యి
మ్మండలిఁగ మాదిరాజకృతకమానుష భక్తపదర్చనాచ్యుతో
ద్దండ జలాభిహేతువని తారు నుతింతురు నాకవీథిలో. 55
మ. అసకృద్గర్వితభైరవాస్రప కదంబాకృష్ట ఘోరవ్యధా
వ్యసనావాల సుపర్వపట్టణ సమాశ్వాసంబుఁ దా రోసి యీ
లసమానాన్నవదాన్యునింట నమితోల్లాసంబు నన్నిల్చెనో
యసమానామరధేనువంచు నిరతంబగ్గింతు రర్థిచ్ఛటల్. 56
కం. ఆ రమ్యాకృతిసతియై, మారార్ధాంగీ కళోపమ నద్యుతియై
సారారాధితపతియై, ధారుణి మాదాంబ యనఁగ తన్వి తనర్చున్. 57
కం. ఏకాంతసాటి కాఁగల, దేకాంతనిజేశ పద్మదయానాళీక
శ్రీకాంతసేవనావిధి, నాకాంతకు నారసోర్వికనాకాంతములన్. 58
ఉ. ఆ సుగుణాలవాల సముదంచిత భక్త్యనురక్తి సంయుతో
ల్లాసమనీమఁగొల్వ నకళంకతఁ గాలముఁ బుచ్చుచుండన
బ్జాసురకీర్తిఁ జేరె ననపత్యవిచారము తచ్ఛమార్థమై
చేసెనతండు పెక్కు లగు చేలహిరణ్యధరాదిదానముల్. 59
శా. ఆరాజద్గుణి కృద్వదాన్య జలధారాలోకనాకీర్ణవి
స్తార శ్రాంత గవ్యారీవధుగళద్వార్బిందు మిశ్రాక్షయై
పారావారశయాను వేఁడ నతఁడంభోవాహముల్ గూర్చి త
త్సారాంభోవహశక్తి నిచ్చెనది తప్పక ధాత్రి కాన్పించునే. 60
సీ. అలనాక నగరౌక సానీకముల యహంకారంబడంగు భోగములనిచ్చె
నలపద్మ నిజసద్మ మగుపద్మ తులిత సౌందర్య రేఖాకన ద్వ్యక్తి మొసఁగె
విధిజేత సువియాంత విద్యాత తామేయ భాషాపరిజ్ఞాన భాగ్యమొసఁగె
ధనరాజు ధనరాజులను దేజముడుపు నవ్యయశాలి ధనసంచయములనిచ్చె
గీ. మాలదైవంబు నొకసత్కుమారునియఁ డాయెనిదె పోలుదైవమాయావిచిత్ర
మంచుఁ బౌరులు చింతింపనాద్విజుండుఁ బుత్రసంపాదనార్తి తాపత్రయమున 61
మ. చతురామ్నాయవిశారదోత్తమవిరాజత్ప్రాజ్ఞలేపారను
ద్ధతి శోధింపఁగఁజేసి తన్నిగమ సూక్తవ్రాత యుక్తక్రియా
రతిగీర్వాణమునీశజంగమ సుపర్వస్తోమ పూజామన
స్థితుఁడై నిన్నిధనం బులద్విజకులశ్రేష్ఠార్థమీఁజాలెనే. 62

ఉ. నీరరుహంబు భాస్కరఘృణిన్ వికసించియు మారుతాహతిన్
వారికణంబుతోఁ బసివాఱు విధంబున ధర్మనిర్మలా
చారము లాత్మజార్థమయి సల్పిన దైవదయేతరాత్మచే
నూరకనిష్ఫలంబు లగుచున్నవి వానిపురాఘమెట్టిదో. 63

కం. ఈచింతచే వివేక ప్రాచుర్యముఁదొఱఁగి యుర్వరాసురుఁ డామ్నా
యాచారవిధులసంతా నౌచిత్యము,గాంచలేక నమితార్తి వడన్. 64

కం. తదవసరంబున వినయాస్పదయై వదనంబువిన్నఁబాఱఁగ నేత్రాం
బుదధారాక్లిన్నకృత సదనాకృతిఁ దత్ప్రియాత్మసతి యిటువల్కెన్. 65

కం. అర్థచతుష్టయమందున వర్ధిలెనాద్యత్రయంబు వరతరకైవ
ల్యార్థము గల్గున సుకుమారార్థప్రాప్తంబు లేక నాగమవేద్యా. 66

మ. భువినిర్ధారణఁజేసివేదములు 'నాపుత్రస్యలోకోఽస్తి' యం
చువచింపన్విన మేహృదీశ్వర వయశ్శో భావపుర్మార్గవ
వ్యవహారక్షయకారికాలమిఁక శ్రీవస్ఫూర్తి రానుండె నా
భవుకారుణ్యములేదు పుత్త్రివతినా భాగ్యంబు నార్జింపఁగా. 67

శా. ఈలోకంబున మద్భుజాలతల నెంతేసంతసంబొప్పఁబు
త్త్రీలోకామితభాగ్యమందక వయఃప్రాణాంతకాలంబులో
నాలోకంబునఁ బుత్త్రినాస్తిక దురంతాభాగ్యనిర్మగ్ననై
యేలీలంబడుదాన నిట్టి జననంబేలా మనోధీశ్వరా. 68

ఉ. సంతతకేసరీభఘుఖ సత్వభయాటవినుండవచ్చు దు
ర్దాంతనిశాతశల్యసముదాయపథంబున నడ్వవచ్చు దు
ర్ధ్వాంత నిశాంతమందు మనవచ్చునుగాక గృహస్థపాళికిన్
సంతతిలేనియింట మనశక్యమె భోగ్యము లెన్నికల్గినన్. 69

చ. ధనములవేలఁ బ్రేమ్యసముదాయము లేలఁ బొలంబులేల మం
డనములువేల హైమసదనంబులు నేల మనోజ్ఞకేళికా
వనములునేల భూవిబుధవర్య పవిత్రకులావనక్రియా
తనయుఁడులేని నవ్యసితతామరసాక్షికి భూతధాత్రిలోన్. 70

కం. తానముఁజేయుని దేహివితాన వితానములఁ జేయఁ దలఁపని ద్విజసం
తానముఁగులకారణ సంతానము లేనట్టిగేహి ధరసార్థకులే? 71

కం. తిలకమునోయని సాధ్వీతిలకము విమలప్రభాప్రతీకంబులునా
నిలసత్కుమారు నోయని విలసద్గార్హస్థ్యవిధియు వృధకాదెపతీ? 72

కం. యాజ్యాల శాంభవమత సామ్రాజ్యాల నిర్ణిద్ర భక్తి మండితసుతపః
ప్రాజ్యులఁ బాపౌఘ పరిత్యాజ్యుల సేవించినారమువియునశించెన్. 73

సీ. ఆనందబాష్ప ప్రతానంబుఁ గన్నుదమ్ములఁ జాఱఁగ నిసుంగుముద్దులాడఁ
గొనగోళ్ళ నెఱులచిక్కులఁబాపి మృదులప్రసాధనీసంస్కార సరవిఁబూన

ననుపమశ్రావ్యగీతాలాప సరణిచే డోలికాలోల నిద్రాళుఁజేయ
నవ్యక్తమంజులాహ్లాదవాక్సంచయ శ్రవణతాపారవశ్యంబునొంద
గీ. నోఁచియున్నానొ లేక నన్యూనమనస్య రసరసాలయమగు నపుత్త్రికపయోధిఁ
బడికృశింపుచుఁ గాలగర్భంబులోన లీనమైపోవ నోఁచియున్నానొ నాథ. 74

వ. అని వినయానతయార్చితాత్త్వయగు తద్భార్య బాలచంద్రవిహీనసాంద్రాంధకార బంధుర కుహూనిశీథినింబోలి నిర్విణ్ణమైయున్న నమ్మందిరమ్మున నిర్యద్విస్ఫురితాశ్రు మిశ్రితాక్షియుగళయై గళావరోధి మేదురవిషాదగద్గద స్వనయై వనజాతహీన నిస్సార కాసార తీర విహార పుష్పంధయంబు చందంబున డెందంబునం దమందంబుగం గుంది విలపించునవసరంబునం గొందఱు వీరశైవ శరణాగ్రగణ్యు లేతెంచి తద్విషాద హేతువరసి యవ్వామదిరాక్షితో. 75

ఉ. ఏల విషాదమొందెదు రహీనఫలప్రదుఁ డంగజాంగని
ర్మూలకభర్గసప్తి పరముఖుండు సమస్త నమస్కృదుచ్ఛిరో
జాలకిరీట భవ్యమణిసారతరోస్ర విరాజితాంఘ్రిుఁడు
ద్వేలదయుండు నంది వగఁదీర్చును దద్వ్రతమాచరింపుచో. 76

క. కావుననన్నందీశ్వరు పావన వ్రతమాచరింపఁ బంపుము యుష్మ
జ్జీవనజనేత్రననుడుఁగ భూవిబుధుండానతియె భార్యకుఁ ద్రిక్షా. 77

సీ. ప్రథితతారస్వరప్రకటగాత్రత విలిప్తహారిద్ర కాంతులింపారుచుండ
సంపూర్ణపూర్ణిమా చంద్రబింబవిడంబఘనసారతిలకంబు కాంతులీన
నాత్మస్థితేశ పాదాబ్జసత్కాళినాఁ గంధసారుద్రాక్షకళికలమరఁ
బ్రథమసంధ్యాచక్రవాకనేత్రము లనా దృశ్యావళి సమ్మదార్తిఁగనంగ
గీ. మాదమాంబిక భువనసామాన్యమాన్యశరణ సంచయదీవనోత్కరములంది
పరిమితాళీకదంబకస్ఫురితయగుచు నందికేశ్వరుగుడికి మానంబునూన. 78

మ. జని తన్నందిపదాబ్జసంస్థిత శిరోజస్థానయై దీనయై
ఘనకారుణ్యనదీన పుష్పశరజిత్కాండా బుధేంద్రార్చితా
వినమల్లోకమనోర్థదాయకసురోర్వీజాత నందీశ్వరా
నినుబోలంగల సత్కుమారుఁ గరుణాన్వితాత్మ నీయంగదే. 79

ఉ. లోకులు చెప్పవింటి నతలోకదయాకలితాంతరంగ నా
లీనుఁడవంచు నన్నసఫలీకృత సేయగదయ్య యాత్మజ
శ్రీకను జేసి రండవగిరీశ మహేశపదంబుజాంతరా
స్తోకమరందపానపరితుష్టపటిష్టవిశిష్టబంభరా. 80

ఉ. పత్త్రవిహీనపత్త్రి ఫలభారవిహీనకుజంబుఁ బద్మినీ
శాత్రవహీనరాత్రి నవసారసహీనసరోవరంబున
త్పుత్త్రవిహీనకాంతఫలమౌ గవనేరవుగాక నొక్కస
త్పుత్త్రునొసంగి కావరదపున్నరకప్రవిముక్తిఁ గూర్పుమా. 81

చ. అసురమహోరగ భయాదాబ్ధి నిమగ్నుననున్న గాంచియా
ప్రసవశరాసనారి పదభక్తుండే ప్లవమంచు నీ వ్రతం
బసదృశలీలఁ జూపిరిక నర్మిలి నావికరత్నమౌచు సం
తసమునఁ దేల్చెదో జలమునన్ మునిఁగించెదో నిన్ను గొల్చెదన్. 82

వ. అని యనేకవిధంబులం బ్రార్థించి దశదినంబు లాశిలాదపుత్త్రివ్రతంబాచరింప
సంకల్పించి తత్కార్యాయత్తచిత్తయై యుండ నయ్యవసరంబున. 88

ఉ. ఉరుదివిషద్ధునీవిలుఠదు జ్జ్వలదూర్మియొ శీతశైలవి
స్ఫురితసరః ప్రచారపరిశోభిత మంజుల రాజహంసయో
పరఁగెడినాఁగ దేవమునివర్యుఁడు నారదుఁ డభ్రవీథిసుం
దరముగ వీణె మీటుచుఁ గృతాంతహరున్ హరుఁ గొల్వఁ బోవుచున్. 84

సీ. శమితభంగురపయస్సాగరోత్తుంగ రంగత్తరంగాభోగ కాంతిగరిమ
శరదచ్ఛపాండుర స్తనయిత్నుమాలికా క్రాంత కాంతామలాకాశదీప్తి
స్థాణుభవత్పూర్ణశారదామృతభానుచంద్రికారుచ్యని స్తంద్రశోభ
గంగాపగాపద్మగంధవాహాకల్ప పాశనేచ్ఛాగతానంతసుషమ

గీ. నతిశయించెడు బంధురసితకళా విలాసభాసురరాజతే లాధరంబు
పూజనాయాత దేవతా ముకుటగళితమణిచయాంకముఁ గాంచి సంభ్రమముదోఁప.

ఉ. స్థాణుపదార్చనాభ్రమిత సర్వసుపర్వశిరఃకిరీట ని
ర్యాణమణీసహస్రసమమృతాంశుకిరీటుని స్రేసఁ బ్రాల వి
న్నాణముఁ జూపు మొక్క మిథునమ్ములు క్రమ్మరు వేళఁ బ్రాప్తక
ళ్యాణవధూవరామల విలాసముఁ దోఁపఁగఁ జేయు చోద్యమున్. 86

చ. సనకసనందనాది వటుసత్తము లీశుభజించు వేళఁ దా
రునుభజియింపవచ్చెడి మరుల్లలనాతనుగంధసమ్మిళ
ద్ఘనమురుదర్చకప్రతతిఁ దాకఁగ నీయక నైకపారిష
జ్జనగళదండశూకసముదాయము వే భజియించునుద్ధతిన్. 87

మ. ఘనగంగాజలసిక్తకేశుల రమాకాంతాస్థియుక్ప్రాణులన్
వినుతార్ధేందుకిరీటులన్ ఘనతరద్వీపిభచర్మాంగులన్
గనదత్యంతవిభూతిలిప్తతనులన్ గద్రూసుతోష్ణీషులన్
గనుచున్ శంకరుబాడుచున్ జనుచుఁ దద్ద్వాఃప్రాగవీథీస్థలిన్. 88

ఉ. సారమసారహీరమణి సంఖచితామల రాజతోర్మికా
శ్రీరమణీయలీలనురరీకృదపావృతరమ్యభామణో
దారతనున్న పర్వతసుతా పరమేశులఁ గాంచి తత్పదం
భోరుహదివ్యపీఠి నిజమూర్ధము నిల్పి నుతించెనీ విధిన్. 89

ఉత్సాహవృత్తము. అంబుజాంబకాంబకా దిగంబరాంబరాలకా
డంబరాంబరాటరాడ్విడంబకాంబరాంతకా

ర్యంబికా హృదంబుసంభవార్క బింబ సాంబహే
రంబ జంభదంభహారి రాజరాజ సన్నుతా. 90

కం. నాగేంద్రహార గర్విత నాగేంద్రతనుప్రహార నతజనసంతా
నాగేంద్రసార మదమద నాగేంద్ర పవిప్రసార ప్రార్థింతుహరా. 91

మత్తేభ కందగర్భితము

సీ. ప్రవిమల జ్ఞానసుర ప్రజార్చిత పదా వీధ్రర్షి వైయద్గవీ మహేశ
సురమణీయాకృతిశోభితామృత కరా రాజత్కృపాసాగరా గిరీశ
వినమదాశావర విద్ధ సంకటచయా నాగావళీ భూషణాయుమేశ
నియమిలోకావన నిశ్చితామలమతీ యర్కేందు వహ్న్యంబకాపరేశ
గీ. దానగజదైత్య భంజన దానవహార ధనద మిత్రదాయక మహితా ప్రపూత
మానకర నాకకేశిణ మానితగుణ దళిత పాప మంజులచరితాయమారి. 92

ఉ. హంస కిరీంద్ర రూపధరులై నళిన ప్రభవేందిరేశులా
హంసపదోర్వ్యపథ్యటనులై కనలేనియుమామనస్సరో
హంసపదాంబుజాతయుగళాకృతిఁ గాంచి సమస్త తాపసో
త్తంసుఁడనైతి నీశ ఘనదైత్య నృశంసక సత్ప్రశంసకా. 93

సీ. ఎవ్వాని తుహితాశు వృష్టి దుర్భరపాతకాభీలదావసంహననదక్షు
మెవ్వాని తేజంబు ఋభుకోటి వనవాటికాదురంతవ్యథాగ్రసనచంగ
మెవ్వాని హుంకార మీర్ష్యావిదగ్ధదక్షప్రజానాథశీర్షప్రహార
మెవ్వాని గళచిహ్న మిల్లవిష్టపజనప్రాణసంత్రాణ పారీణతాంక
గీ. మెవని పళ్యల్లలాట మబ్జేషు రమ్య విగ్రహేంధన దహనప్రవీణరూఢ
మట్టి నతహృషీకేశు లోకాంబికేశు నున్నతాకాశకేశుభవ్యుని భజింతు. 94

కం. ఈరీతి సన్నుతించెడి నారదుఁగని దైవతాధినాథుఁడు ముని కిం
కిరవ నీ యీ రాకకుఁ గారణమెదియో యెఱుంగఁగాఁజేయు వెసన్. 95

ఉ. నావుడు బ్రహ్మసూను డఘునాశకుతోఁడ వసుంధరాస్థలిం
దావక పాదభక్తి ఘనదార్ఢ్య మహత్త్వము లంతరించెఁగా
నావసుధన్ జనించి సకలైకమహోన్నతశైవ భక్తిను
ద్దీప్రివ మొనర్చురీతి నురరీకృత బుద్ధిఁదలంపు మీశ్వరా. 96

కం. మత్తిల్లి జైనవర్గము చిత్తజ సంహారుని దైవశేఖరు మిమ్మున్
రిత్తనొనర్చిరి మీదగు భక్తిన్ భువి నుద్ధరింపవలయు మహేశా. 97

ఉ. రాజితమంజునీల మొక తాయిగ నంచెడి వాయసాకృతిన్
భ్రాజిత యమ్మదీయ మత పాత్య మెఱుంగమి మర్త్యపాళి పృ
థ్వీజగళద్విపక్షకురువిందము బింబము నాఁదలంచు ని
ర్వ్యాజిత కీరమట్లు నిరతోద్ధిత జైనమతంబు నంటెడున్. 98

చ. అటనటఁగల్గు శైవు లఖిలాధిపుఁ డీశుఁడె తన్మతంబె వి
స్ఫుట మతరాజమంచుఁ బరిశోధితనైగమవాక్యపద్ధతిన్
బటుతరబోధసేయ నది బంధుర జైనమతానురక్తిలం
పటులకు నూమరోర్విఁ బహువర్షమునా విఫలించెనీశ్వరా. 99

కం. కావున దైవగ్రామణి తావక పదభక్తి భూతధాత్రీస్థలిను
జ్జీవిత మొనరింపఁగ మీరావిర్భవ మందవలయు నంచు వచింపన్. 100

కం. మందస్మితాననుండై నందిం జేరంగఁ బిల్చి నందనవింటే
బృందారకర్షిపల్కులు సుందరముగ శైవమతము శోభిలవలయున్. 101

ఉ. ఏకడనీకు నాకు లవమేనియు భేదములేదుగాన భూ
లోకములో జనించి భవలుంఠనదక్ష మదీయభక్తి న
స్తోక మొనర్చి యన్యమతదుర్వాదగర్వనివర్తనక్రియా
ల్లోక మహాద్విభూతిధరలోఁ జరియించి యుదంబుఁ గూర్పుమా. 102

చ. అదియునుగాక ధాత్రి నిపుడాతత భక్తిని మాదమాంబ య
న్మదిత భవద్వ్రతంబు సుతుఁ బొంద నొనర్చుచు నుండెఁగానఁ ద
న్మదిరశిరోజ గర్భజనితుండవునై తరదస్మదీయమో
తదచణభక్తినిస్తులముగా వసుధాస్థలి నుద్ధరింపుమా. 103

చ. అని శివుఁడానతీయ నెమరాడఁగ భీతిలి తండునైద హృ
ద్వనజ మెలర్ప సాంబు పదవారిజపీఠికి మ్రొక్కియొచ్చటన్
మనినన దేమి. యుష్మదసమానదయారసవాహినీఝరిక్
మునిఁగినఁజాలునీశ భుషిఁ బుట్టెద శైవము నుద్ధరించెదన్. 104

కం. అనిపల్కి మ్రొక్కి వీడ్కొని చసి తా మాదాంబికాలసద్గర్భములో
నొవరఁగనామె యపుత్త్రిక వనధి లంఘింప గర్భవారధిఁ దాల్చెన్ 105

సీ. భ్రూణస్థితార్భకారూఢాంగకాంతినా నాపాండుశోభితాస్యంబు వొల్చె
దంతుభీతి విధూత దహరపాపములునాఁ జూచుకంబులఁబర్వె మేచకాభ
లింగప్రభమార్భకార్చితపయోత్తములునాఁదతపయోధరపయోధారలమరె
గర్భస్థబాలకాఖండతేజోసహ్య భావంబునాఁదనూభరముఁ దనరె
గీ. నుదరవందీశ లసమానయోగ నిష్టనిర్మలాపూర్తికై నాఁగ నెలఁతకంత
కంత కభివృద్ధియయ్యె నిద్రాభిలాష మతివతొలుదొల్త నెలఁదప్పు నవసరమున 106

గీ. మానసానందకంధినిర్మలతరంగజృంభణోద్వేల తాడనాహీనచలిత
కూలమనులీల లేఁగౌను గొద్దిగొద్ది కానఁబడఁజొచ్చెఁ దన్మత్తకాశినికిని. 107

గీ. స్వీయకాంతిని గర్భస్థ శిశువుపిల్చెఁ బక్వమాగాగ తార్యమప్రభవహించు
నిందు చందాన వేళప్రాప్తించుపట్ల ధాతమాత్రంబొసంగఁడే తనదుపదవి. 108

వ. ఇవ్విధంబున వృద్ధిఁ జెందుచున్న యగ్గర్భంబు శరత్త్రయంబునిల్చె. అందులకుం
బరితపించు మాదాంబికాస్వప్నంబునం దొక్కనాఁడు బుక్కేశ్వరుఁడు సాక్షా

త్కరించి తల్లీ తలరంబని లేదు నీ గర్భంబునం దసమానతేజమున్నయది. సత్వ
రంబ ప్రసవింపఁగలవు. సంజనితపుత్త్రునకు బసవేశ్వరుఁడను నామకరణంబొనర్పు
మని యాదేశించి యంతర్ధినొందె. అక్కాంతారత్నంబు నమ్మఱునాఁడె సుక
రంబుగా నొక్క సుకుమారు సుకుమారుఁ గాంచె నబ్బాలకునర్ధోదయకాలంబునఁ
బరమేశ్వరుండు సంగమేశ్వరాకృతిం జనుదెంచి లింగసంగుంగావించి లింగానర్పిత
మెద్దియు నబ్బాలకునకీకుండ నియమించి యదృశ్యం జనియె. అబ్బసవేశ్వరుఁడును
బాల్యంబు పౌశీల్యంబుగాఁ బుచ్చె. వాఁడియుద్వితీయశంభుమూర్తిగావున సకలవేద
వేదాంగంబులు సరహస్యములుగాఁ బరిజ్ఞాతములయ్యె. అంత మాదిరాజుపుత్త్రునకు
పయనంబొనర్ప సకలబాంధవుల రావించుటయు బసవేశ్వరుఁడు వీరశైవుల
కుపనయనం బనవసరమనియు దూష్యంబనియు వాదించి తండ్రి యొడంబడకున్నం
గినిసి సహోదరియగు నాగమాంబాయుక్తుఁడై యిల్వెడలి పోవుచుండ దన్మాతు
లుండగఁ బలదేవుండు నిజపుత్త్రిగంగాంబ నాతనికిఁదలంచువాఁడై తోడ్కొని
చనె నయ్యది వసంతర్తువుగాన, 109

క. చిరకాలమానమద్రాస్ఫురితతపఃపూర్తినవ్యపుష్పరికనుల్
దెరువఁగఁ దద్ఘోరతపోద్ధుర కీలింగాలె నాఁగఁ దూలెన్ ఛదముల్ 110

క. ఇలవిస్రస్తచ్ఛదనచ్ఛలనాదుఃఖిత మహీరసాజాతాశ్రూ
త్కలికాజాతప్రక్రియఁ దలసూపుచుఁ బల్లవప్రతానమిగిర్చెన్. 111

కం. తారుణ్యదాతృమాధవుఁ దారుపదల గౌరవింపఁ దాల్చినముక్తా
హారములన హీరద్రుమ వారములన శేషముకుళవర్గములొప్పెన్ 112

సీ. రమణమాధవపరీరంభణార్జితమహోల్లాసకాననరమావాసరుచియొ
తారుణ్యలబ్ధ సుందరమహీజాత సంతోష సూచ్యాశ్రుసందోహకళయొ
విద్రుమానీకనిర్ణిద్రశోభాలోక నేచ్ఛాగతోడుసంఘాతిశయమొ
సర్వప్రియప్రియాసంధానసంధానిదాన భూమీజసంతానవిభయొ

గీ. కామకీసంచయాన్య చింతామహాతమోనిహంతృవిశాలదీపానవద్య
కాంతియోనాఁగ సకలవృతుమలసుమనికాయములువొల్చెఁ జూపరకన్నులలర.

క. శిశిరర్తునాశకేచ్ఛావశతాళితతహిమవారి వరమధుహేలా
దశవెలయించెననంగా విశదద్రులు పూలకొసఁగె విమలాసవముల్. 114

ఉ. ఆత్తసుపర్ణుఁడాగమవిహారుఁడుస వ్యాతదుమ్పలాశుఁ డ
త్యుత్తమ కాంచనాంశుకుఁడునుజ్జ్వలవన్మధువర్ధనుండునై
యుత్తరినొప్పె మాధవుడనంగ ననంగసహాయదివ్య సం
పత్తి ధరాజయుక్తి నల మాధవుఁడుర్వి జనోత్సవంబుగా. 115

గీ. దూషితపలాశరాజి నిర్ఘాతముగను జేయునారామదృష్టి నశేషయుక్తి
ధరణిజామోదమిగురొత్తెఁ దనరె నుర్వి సకలసుమనోళి ఘనమహాసవనిరూఢి 116

క. నానాప్రఫుల్లసుమసంతానాత్తమరందబిందుధారాప్లావా
మానానందవిహారోద్యానాళివితానగాన మగ్నంబయ్యెన్. 117

ఉ. మానవతీచయంబు నవమానము సర్పఁగ నిండిరాసుతా
మానసహాయమగ్రమని మాత్మసుమోత్కర తేజితాస్త్ర సం
తానము పాయనంబను దినంబు నొసంగఁగ మాధవుండు తి
త్తూనకలంబుఁ బిల్చుపటునూక్తులనందగె నయ్యళిధ్వనుల్. 118

సీ. ధారాళమకరందధారాలసద్గంధసారాత్తసుమబృంద సంకులంబ
మందాసవాలంబమందారసుమలంబగంధాంధరోలంబ కలకలంబు
నేలాలతావారహేలాఫలాహారలీలాచరత్కీర లాలితంబుఁ 119
జాతాగమాలోలపూతామలకిసాలజాతాసనవిలోల సత్పికంబు

గీ. సత్త్రతతిగాఁగ మార్విగానశ్వముగఁ జమూసమూహంబుగా మహోల్లాసభాస
మానకందర్పుఁ డతిదర్పమూనియాని సర్వలోకైక విజయాజి సల్పఁబూనె. 120

కం. గుంజన్మధులిట్పంచయ శింజితమలకుంజగర్భసితనేత్రాప
న్మంజీరరవమడఁపనవ్యాంజితగతి కాముక ప్రవర్తనల లరెన్.

ఉ. ఆ వికచప్రసూనదరహాసములా కిసలారుణాధరా
జీవికజాలకంబు లవిశీర్ణ నవీనపలాశకాంతులా
పావనకోకిలప్రకరపంచమనిస్వన గానముల్ ధరి
త్రీవలయానుమోదములరింప నొకానొకనాఁడు వేడుకన్. 121

కం. లీలన్ గంగాంబ సమస్తాళీ జనసేవ్యమానయై చనెఁ గదళీ
సాల రసాలతమాలనవైలా సాలాలవాల హేలావనికిన్. 122

వ. ఇట్లు చని యయ్యరవిందశరాబృందంబు సుందర వసుంధరాజసమాజ
విభ్రాజదేతదఖిలాభిరామ శోభారామసీమ విరామంబులేక నశోకరసప్రదేశ
ప్రవేశ చిత్తనాళీకనికాయలై నిర్యదనేకసారసాసవాసారధారాప్రసారఘనా
రసారిణీ కూలనిజాళిసీ నిమిత్త గవేషిమరందబిందు బృందాంధసాత్తగంధాంధ
మిళింద పాంథసందోహసోహళ విహారవికార ఘీంకార ప్రకారంబులం బ్రేణి
సేయుచుఁ గంజాతపుంజ రంజిత మంజు కాసార తీర హేలాతివేల ఖేలనారంభ సం
రంభ కాదంబ కదంబ శుంభద్దంభ యానంబుల మానంబులుగాఁ జేయునిజ
యానంబులం జూపుచు ఫలపుష్పభారానమ్రమధురామ్రవనస్పత్యాలోల శాఖా
శిఖారోహకాతుల్లకోల్లసత్పల్లవగ్రసనవ్యసనాకంఠకలకంఠకల కంఠీర వోత్కంఠఁ
గుంఠీకృతంబుగా నిజకంఠంబుల నెత్తిపాడుచు ద్రాక్షాఫలాపేక్షా విచక్షణా
శుకంబులగు శుకంబులంబట్టి తియ్యఁదనంపు విలాసంపుఁ బల్కులం గఱపుచు
నిచ్ఛాగతి నాడుచు నొండొరులతో, 123

సీ. పురుషవృక్షపు గొమ్మకొమ్మలు పారఁగనుగొమ్మ పురుషవృత్తంబేల పొలఁతులార
యలపలాశపలాసి వెలుఁగొందెనె విలాసి యలపలాశుల పొంత కరుఁగనేల

గాంచనాగముకాంత కాంతివర్ధిలెఁగాంత కాంచనాగం బెట్లు కాంచఁగలము
కరకాగ మభిరామ కలసమిూతెనెరామ కరికాగమున్స్ఫూర్తి కలఁతగాదె
గీ. అదియెరాజధరాజమో యున్నమిన్న రాజముంచఁ బడుట ధర్మంబెకన్న
యనుచు సఖులెల్ల శ్లేషవాక్యప్రచారధీరసంచారసరణి వర్తింపుచుండి. 124

ఉ. భాసురకర్ణికగ్రహణవాంఛ మదాళినికాంతమానసో
ల్లాసత వచ్చెఁ గంటెయని రాజనిభానన యూర్తు వల్కుదఁ
డ్భాసురకర్ణికగ్రహణవాంఛ మదాళికినైజ మైనరా
డ్వాసులపొంతఁజేరగలరా యనవేఱొకయింతి నేర్పునన్. 125

కం. పురుషుస్కంధముసల్లదె సరసగతిన్ మహిళయానె శ్యామాకనవే
పురువస్కంధము నెల్లెడ సరసగతిన్ మహిళయాన సహజంబుగదే. 126

ఉ. మధుపికవైరియైన యలమాధవు నుల్లసిలంగఁ జేసెనా
పృథివిజరత్న మప్పుడని వింటిమిగాద విచిత్రమయ్యె నీ
మ్మధుపికమిత్రవర్యుఁడగు మాధవు నుల్లసిలంగఁ జేసె నీ
పృథివిజరత్నమిద్దె కనవే యని యిందిరనీలకుంతలా. 127

కం. దళయుతమై ద్విజహితసత్ఫలదము సుమనోధివాస భాసురమునునై
బలవత్కాండాధారో జ్జ్వలమై యున్నగము రాజసభవోలెఁ జెలీ. 128

సీ. అరుణపల్లవగణస్ఫురితపర్ణచయంబు రక్తసిక్తేభచర్మంబుగాఁగ
లలితఫలగ్రాసాభిలాషాశుకశ్రోటికాంతి నెన్నుదుటి ముక్కన్నుగాఁగ
రమణీయగానసంభ్రమలోలకలకంఠికంఠోపకంఠపంకంబుగాఁగ
నురువిలంబితశిఫావ్యూహసంభారంబు ఘనజటాజూటసంఘంబుగాఁగ
గీ. దీర్ఘవల్లితశాఖాప్రదీప్తి విమలహస్తసంభృతశూలాది వస్తువులుగఁ
బొలఁతి యీస్థాణు వాస్థాణుఁబోలియుండెఁగాన సర్థింతమాఫలోత్కరములొందవు.

చ. లలనరొ దాడిమీకుజవిలంబిసుకార్భకశాతచంచుని
ర్దళితశలాటుబీజసముదాయము నగ్నికణభ్రమావహా
విలమతి నేణసంతతులవే పొదరిండులఁ బాసి తత్సర
స్సలిలము నాశ్రయించె భయశాంతికిఁ గైతవతర్షకంబులై. 130

కం. భాసితతమాలవసుధాజాసితహేలాధకృత్రిమాంబుదశంకా
ధ్యాసిత శిఖండివరముల్లాసితలాస్యంబొనర్చెలలనాకనవే. 131

కం. భాసురములు కుసుమాంతః కేసరములు మేననంటఁ గేరుచు నళిసం
భాసిత జీవంజీవవ్యాసక్తినిఁ బొందఱును నళులవెగంటే. 132

చ. పరభృతమల్లకొమ్మనవపల్లవ వాంఛను నేగుదే వృథా
భరితము భూమిజాతమనుభావన మాధవుఁడంపుఁ దద్వని
ర్భరమధువానుగంధవహురాకను ధైర్యమునంది కొమ్మభీ
కరముగనూఁగసాగెను బికంబు పసంగలదంచు నింకొగిన్. 133

మ. కనుమా కోయిల కంఠమెత్తుచుఁ గుహూకారంబుఁదోరంబుగా
మనఁ జ్రేణి యొనర్పుఁ బంచమలసన్మాధుర్యధుర్యారవం
బొనరింపంగనలేక మాకళి దురీర్ష్యోద్రేకతం ద్రోచెనా
మనుజాళింగనరాని వ్యాత్సహన తామాన్యత్వ మవ్వానునే. 134
సీ. మాకందమదె కాంచుమా కందరాశ్రేణి పల్లవోల్లసితమై ప్రభలనీన
నేఁడాకులరటద్దె నేఁడాకులము లేక దళమురునోమ్మద కందళముఁగూర్చ
మందారమద్దే యమందారవమిళింద బృందంబునకు విందునిచ్చు మెచ్చ
నారంగమద్దె చెన్నారంగ నారంగమును రంగదభిరామముఁగనొనర్చ
గీ. నంచు ననబోఁడులెల్ల వాక్షించి వనిరసాలసాల హింతాల తాంబూలతాల
కుంద కురువిందబాణాదికుజ నికాయ శోభలనుగాంచివర్ణించి సొబగుమీఱ. 135
మ. అలరుంబోఁడులు గాంచిరొక్కట దరవ్యాకోచవన్మంజరీ
విలసత్కైరవహల్లకాంబుజ బిసప్రేంఖచ్ఛిలాధ్యాగతో
జ్జ్వల కాదాంకవిధీభవన్మధుకర వ్రాతోరుసంచారమున్
జలజానర్గళనిర్గళన్మధునభస్వత్కీర్ణ కాసారమున్. 136
కం. కాంచి యుదంచన్మోద ప్రాంచన్నిజ చిత్తలొచు రామలుచని రాఁ
గించిద్విచారహీనుల కెంచఁగ నింకెవ్వి సంతతేచ్ఛాకరముల్. 137
కం. ఇవ్విధి నవ్వధులవ్వల నవ్వనజాకరముఁ జేరియతుల ప్రియులై
యవ్వారలుశవ్వారిగ నవ్వారిని వారికేళి నలరెడినంతన్ 138
గీ. తొలుతనాలోల నేత్రకాంతులకునోడియంతకుచశైలపతన విభ్రాంతిఁబాటి
పిదప జంఘామహోనక్ర భీతిఁజెంది కానరాకుండననిమిషోత్కరము డాఁగె. 139
చ. గురుకుచభూధరేంద్రహతి ఘూర్ణితభంగనికాయభీమ్మశం
బరమగు నత్తడాగవరమండిత పుష్కరిణీ దళాసవాం
తరపరిసుప్తబంభరవితానము లాతతభీతి నున్మద
స్ఫురణమడంగి నింగికనవోయె నపాయనివృత్తికైత్వరన్. 140
కం. కేళీహితనాళీకుచ పాళీకల్లోలి తాబ్జభయదళి సంతా
నాళీకధ్వనివార్తా నాళీకస్థితిక నేడ్పునాఁగఁదవర్చెన్. 141
శా. శ్యామాసామవిభీతిరోమా ముఖని శాస్త్వామాక్షణ త్రాసమో
సీమాచంచదళివ్రజాసితకళాస్ఫీతాంధకారక్రియా
భీమంబో వికచాంబుజాత చయముల్ బీటెండఁ జెన్నొందకన్
మోముల్ వాంచె భయంబు సర్వవిధవాంభోరాశి కౌర్వంబుగా. 142
మ. తరుణీపీన పయోధరాంతరహరిద్రాకాంతి సంవేల్లితాం
తరకింజల్కరజోమిళద్రుచిరపద్మశ్రేణిచామీకరా
బ్జరమాప్తి వహింప మానససరస్సంచారి కాదంబముల్
త్వరితోడ్డీన గతింద్యుగంచవిమల స్వర్ణిమ్నగా భ్రాంతిచేన్, 143

మ. లలితోన్మేషవిముక్త పద్మనికరగ్లానీక్షణోగ్రవ్యథా
కలనా దంభమునూని బంభరము లగ్గంగాపగా ప్రోల్లస
జ్జలజాంతర్మధులబ్ధి కేఁగె నటవాంఛాసిద్ధియానే హిర
ణ్యలసత్స్నానము లవ్విగావొకొ మధూన్మత్తుల్ విచక్షాత్ములే. 144

ఉ. ప్రీతిఁబరస్పరోక్షిత కృపీటము లత్తరుణీమణీకచ
వ్రాతవిశాల మేఘపరివర్తితవారిగ ధార్తరాష్ట్రముల్
భీతి సురాయనోత్పతన పేశలతన్ విడికుంజపాళిసం
భూతతతీతుఁడాఁగె నతిముష్కరశల్య విబాధితక్రియన్. 145

ఉ. కాలవిశాల వేణి యుదకంబులఁ గ్రాలఁగ నొక్కబాలస
న్నాళిముఖోక్షితాంబువుల నారులపై వెదఁ జల్లు చున్నయా
లీల నుతింప నయ్యె బహూళీకృత చాతురిఁద త్తటాక కీ
లాలము వేణివీచ్చివిమలంబుగ తూడున కిచ్చుచుండెనాన్. 146

ఉ. అంబుగతార్క బింబమపుడారయ నొప్పెనమాయిక ప్రియా
బ్జంబులరీతియున్ జలజపాణిచయా మలనైక చంద్రమో
బింబసమీక్షణస్థితియు బిట్టువిషాదము భీతియున్ దురం
తంబుగఁ గూర్ప నజ్జలమునం జలియింపుచుదాఁగెనో యనన్. 147

సీ. మాముఖంబులకు నెమ్మాడ్కిఁబోలునటంచుసలిలపూరము వారిజములవోసి
మానేత్రములకు నెమ్మాడ్కిఁబోలునటంచుఁగుముదసంఘాచలత్వము హసించి
మా బాహువులకు నెమ్మాడ్కి బోలునటంచు బిసకాండవివరముల్ పృథులపఱచి
మా కేశములకు నెమ్మాడ్కిఁబోలునటంచు శైవలాప్రఘణప్రసారమరసి
గీ. మాదు గమనిక కెట్లుసమానమంచు నగురుటంచల నను వీథికెగయఁబంచి
స్వైరిసంచారతానిర్విచారధీరసారసాక్షులువిమల కాసారసీమ. 148

చ. అదెకమలామలామృత రసాధరమాధురినానిగర్వసం
పదమిగులంగ భృంగపతి మాపతిగాఁగసువర్ణ వాసమిం
పొదవవహించి వ్రేతలను రోజ మనంగదియంగవచ్చెనో
మదవతులార దానిమదమార్పుదమా యనెనొర్తు యుక్తిగాన్ 149

మ. చరదిందిందిరనీలవేణి కనవేసంపుల్లపాథోరుహాం
తరమాధుర్య మరందపానజనితోన్మాదంబునన్ ద్వత్కచ
స్ఫురితాత్మీయవధూచయభ్రమ నళిస్తోమేశుఁడే తెంచి వేఁ
డరలెన్ తత్కచబద్ధకాంచనసుమస్తోమాతిరేకంబునన్. 150

కం. ఇగ్గతినగ్గజగామినులగ్గలముగ దత్సరో విహారప్రియులై
నిగ్గున ప్రముగ్గినమొగ్గల నగ్గించుచువారికేళి నలరుచునుండన్. 151

సీ. అతిరామ ఘృణిధామ మగుహేమ కళమీఱు తరుణగాత్రాంశువుల్ తాండవింప
నిర్నిద్ర రుచిభద్ర నిజవిద్రుమాచ్ఛిద్ర పాటలాంశచ్ఛటా ప్రభలు [illegible]

మితలోలకీలాల గతికళాధిచ్ఛాయ హాసియించుచురుంద్రలోలాక్షులలరఁ
జతురాస్య యగువేశ్య కృతలాస్య మనుదూష్య మొనరించుభంగివల్గనములలరఁ
గీ. ప్రేక్షకానీకచిత్తారవిందకందళీకరణచంగమోహన శ్రీకరండ
బాలకంబరమొందు తద్బాలికాకదంబ నయనాంబుజాతోత్సవంబుగూర్చఁ 152
ఉ. ఆవరకంబరంబుఁగని యాకరి యానలనూనహర్షసం
భావితచిత్తలోచనసమూన మృగంబదె కంటిరే విద
ర్భావనిజానిజాపరిణయార్థసమర్థమరాళమట్లుగా
నీవనజాక్షి పెండ్లికిడియే ఘనపాత్రవహించునే మొకో. 153
చ. అనిదగహాసభాసురవచోధరవర్తిత చంద్రికాస్మితా
ననములమంజుకుంజసదనంబులఁ దూఱుచు భీతిఁబాఱుచుఁ
దనరెడి ధావదాశుపరితాపవశాలసచిత్తకోశతన్
చనియెడిలేడిఁబట్టజనసాగెడునంత విచిత్రవైఖరిన్ 154
సీ. నిగ్గునవ్వులవాఁడు నెగడొందు శరదిందు ప్రభడింగుపఱచువక్త్రంబువాఁడు
గొనబుపల్కులవాఁడు కనకంపునవకంపు కళనొంపు రుక్ప్రతీకంబువాఁడు
శోణాధరమువాఁడు సుమభల్లపరిఫుల్లకమలోల్లసచ్ఛరాక్షములవాఁడు
సూక్ష్మమధ్యమువాఁడు సురపాలకవినీల తరనీల కేశబంధంబువాఁడ
గీ. నవ్యసౌందర్యధుర్యతానంగమూర్తి బాలికారత్నయుక్తుఁడై ప్రభతలిర్ప
స్వీయజనకుండునిజమహాసేనకొలువ నరుగుదెంచుటఁగాంచె గంగాంబయపుడు.
సీ. భూరిభీతకురంగపోతలోలవిశాలచక్షుర్ద్వయంబునిశ్చలనమయ్యె
నురుశాతకుంభకుంభోజ్జ్వలస్తనయుగంబుబ్బి యొండొంటితో నొనరఁబోరెఁ
గస్తూరికాగంధకలితఘర్మకణోత్కరంబాపటంబు నార్ద్రింబొనర్చె
విభ్రాంతిహేతువైవిద్యుల్లతాసన్నిభప్రతీకంబుకంపంబునొందె
గీ. నద్భుతవయోవిలాసదివ్యత్సమస్తనిస్తులాంగవిభావజిన్నిరజాస్త్రి
వతనివీక్షించు గంగాంబకబ్బురముగ సాత్వికోదయమయ్యెహృత్సరసిజమున. 156
ఆ. వె. వైరవంబులగుటఁ గన్పేఁడందెనో వరచకోరులాట వాంఛపడెనో
తన్ముఖామృతాంశు దర్శనాభ్రాంతిమణిలఁజాలవయ్యె సుగువకనులు. 157
క. పంచాస్త్రచాపముక్తో దంచత్ప్రసవాశుగప్రతానస్పర్శా
కంచుకవిధిఁబులకలు తత్కాంచనసమనాపమేనఁ దద్దయువొడమెన్. 158
క. మారోక్షితనూనాశుగ సారనిమగ్నీకృతాంగజాతస్వేదా
సారముపొల్చెను దచ్చ్యుత ధారాళమరందబిందుధారాభంగిన్. 159
క. స్వేదజలద్రుతఘుసృణాపాదితతిలకప్రసారవాఃకణములుత
ద్వేదండయానదహరాపాదితమారప్రతాపసరణిం దెలుపన్. 160
ఆ. వె. అవినూత్నపూరుషాగ్రగణ్యుఁడుఁగాంచె స్మరునిమ్ములకులనఁగఁజాలుకనుల
నిశ్చలత్వకామినీనేత్రయుగళంబుఁ బావుషేణ్యచపలభంగిమెఱయ. 161

క. ఆయాచూపులకలుకలేయువతీయువకహృద్ద్వయింగలిపె వెసన్
గాయజుఁడస్త్రప్రసవబలీయంబగు ప్రోఁటఁగట్టి రెండిఁటినపుడే. 162

వ. అంత. 163

క. అన్యజనాగతకేళీవన్యాంతరభూమి కేళివామావళికిన్
మాన్యంబుకాదు పదవే కన్యాయని చెలులుకన్యకంగొనిచనఁగా. 164

క. పదములుతొట్రిల పూరుషవదనము హృదయంబులో నవారణమోహా
స్పదమైవెలయఁగ మారపరిదరములలయింపఁజనియె రామామణియున్. 165

వ. ఏతత్కాంతామనోమలిమ్లుచాయమాన బసవేశ్వర పురస్సరంబుగా నాత్రోవం
జనుదెంచు బలదేవుండును సానుగుండై నిజాలయంబు త్రోవం బట్టె నంతం
గ్రమక్రమంబున. 166

సీ. చరమాద్రిపావకజ్వాలాకదంబతప్తాంబర శ్రీకిరీటంబనంగ
విధురాప్తదృగ్జాతవేదనాభరపీతసలిలజాతాంశుమండల మనంగ
యామినీదానదంతావళోగ్రకరాగ్ర లబ్ధాహారరుణోత్పలం బనంగ
నపర భూభృత్తాపసాశ్రాంత నియమకృత్ఫణితోజ్జ్వలత్తపః ఫలమనంగ

గీ. నాకలోకేశ దర్శనానంతరాత్మకంజనేత్రానిమిత్త సంగ్రహిత వరుణ
హస్తసంభృత వరవిద్రుమాశ్మ మనఁగ నబ్జబాంధవబింబమస్తాద్రినొప్పె. 167

మ. హరిదశ్వజ్వలదాభ సంగ్రహణలీలా యాతవైశ్వానర
స్ఫురదాభీలశిఖావిదగ్ధ చరమక్షోణీధరాసన్నభూ
కరకాంతారకుజవ్రజప్రభలునాత్మామండలాకీర్ణమై
యురుసంధ్యాతపకాంతులొప్పె నిబిడ ప్రోద్యద్విధానంబుగాన్. 168

కం. సాయంభస్కర [illegible]ండఁ కాయండల విష్ణుగానఁగాలాధ్యాప్తిన్
స్వీయాలయంబు చేరఁగఁబోయెను నా దినకరుండు మసఁగెఁబయోధిన్. 169

మ. అపుడంభోరుహమిత్ర బింబమటులస్తాంభోధి నిర్మగ్నమై
విపులధ్వాంతసమావృతామిత భయావేశంబు నప్పద్మినీ
చపలాగాత్రికిఁగూర్ప బంభరతనూజాతున్ మధు స్తన్యపా
నపరత్వోత్కట నిద్రకౌఁగిటను బొందంజేసెఁ గుంచన్మ్రమన్. 170

ఉ. ఆతటి నొక్కకోకి యెటనాత్మప్రియుంగనలేక శోకవి
ద్యోతమనస్కయై సవితతోఁగిరణార్థము నేఁగెవంచుఁదా
కాతరరావయై చరమకంధి తటంబున కేఁగుచోఁ దమో
భూతవిలోకభీతి నొక భూజముపైనొఱగెన్ విసత్త్వయై. 171

సీ. యామినీగంధేభగామినీ మణిపరివ్యస్త ధమ్మిల్లవిభ్రమమనంగ
క్షోణీతలోన్నత శ్రోణీమణీశ్రాయ పద్మేశ విశ్వరూపంబనంగ
వాసరారణ్య విధ్వంసకానేహసప్తార్చిః ప్రభూత ధూమాభమనఁగ
రాత్రిరాణీరత్న రాజన్నిషణ్ణస్మరామాశ్మ వేదికా ప్రభలనంగ

గీ. జనకుఁ బడఁద్రోయు నలకాల మనుజు ముంపఁ ద్వరితగతి వచ్చు రవిజా ప్రవాహ మనఁగఁ
జెలఁగె బహుళాంధకారమాళిత శైలసేతుపర్యంతవిశ్వంభరాతలమున. 172
కం. హీరప్రభాహారసుధాధారవిధానముల నొంచి ధారాళగతిన్
దారకణావారగణాకారగుణాపార తారకాతతి పొల్చెన్. 173
మ. ఉదయించెన్ శశి తూర్పుకొండమొనపై నుద్యత్సుధాభానులా
పదగోత్రాంతరసీమ నింపుచు విజిత్వాకాసురాశానగా
భ్యుదయాభూతసుధాఘటాకృతిఁ జకోర్యుత్సాహయుగ్గీతసం
పదసాంపార సమస్తపాంథజనహృత్సంకోచపీడాక్రియన్. 174
గీ. హంసుఁ డేగఁ దమోమగ్నమైన జగము నుద్ధరింపంగవలదె రాజన్న ఫలము
టంచు నారాజు నిజబంధురామృతప్రదాతృకరములఁ దేజముద్ధతి నొసంగె. 175
సీ. చంద్రమండలపయస్సాగరోల్లోలకల్లోలనిర్గతఫేనజాలమనఁగ
విరహసంచయ మనస్సరసీజభగ్నవాంఛాముక్తస్మరశరాసారమనఁగ
బళ్యతోహారహంసపరివారసాధ్వసోద్వేలమందాకినీవృష్టియనఁగ
రాజప్రసూచకోరకసుతావళిఁ దన్సుధారాశకుచదుగ్ధధారలనఁగ
గీ. నంధకారనిశాటిమాయంబు గాఁగఁ జంచరీక సమూహ మబ్జములఁ దాఁగఁ
గుముదసంతతి చెలరేఁగ గుముదలీలఁ గౌముదీశోభ మించె దిగ్వళకమందు. 176
సీ. ఊరీకృతాత్మాభిసారీసకాముకాగారీభవత్కుంజకాంతికంబు
దూరీకృతస్వీయనారీపునస్సంగమారీణహర్షచ్చకోరకంబు
నిందీవరవ్రజస్యందిద్ధమధుసరస్సందీప్తఖేలదిందిందిరంబు
నాకీవినీలవేణీకీలితప్రసూనాకీర్ణగగనదృశ్యాముతేందు
గీ. మండలభ్రాంతకేళికామలనికుంజగర్భకుంజరయానావినిర్భరాంగ
చిరపరిష్వంగమోదకించిచ్ఛయాళు కమనములరారెఁ జంద్రికాగాఢదీప్తి. 177
ఉ. ఆ కెలివెన్నెలన్ సుమశరాసనతుల్యవిలాసవిభ్రమ
ఖ్యాతసురూపశాలి బసవన్న వనిస్థలదృష్టపాండురా
జాతసమాననేత్ర మదిఁ జక్కఁగ నిల్పి మనోజవహ్నికీ
లాతతబాధ గూర్పనపుడ త్తరుణీమణి గేహసీమనే. 178
ఉ. ఎట్టులఁ దానిఁ గాంతు మదనేషుల నెట్లు జయింతు సంతస
మ్బెట్టుల నేవహింతు మది నెట్టుల వేదన వాయునయ్యయో
తెట్టువఁ బాసి యూర్లఁబడి తీర్గడినే నెటులవ్యధూటిచేఁ
బట్టఁగనేర్తు దీనులగువారలకెక్కడి కామితార్థముల్. 179
కం. హేలావాలామారునికోలా భువనైకరూపగుంభితసుమనో
మాలా కౌశదినిక్కఁపు బాలా యెఱుగంగఁజాలఁ బరికించి వెసన్. 180
సీ. అతిలోకసౌందర్యవతి నొక్కనవలాను సృజియింపవేఁడి లక్ష్మీసుతుండు
జ్యాదిద్వయీచతురంతపోణంబు లిప్యాసనంబు సప్తిసైన్యధ్వజంబు

లర్పింపగా శారదాధీశుఁడే తల్లతాంగీశిరోజరమ్యాననంబు
నరుణాధరంబుదంతాళినేత్రద్వయంబభినవభ్రూలతావిభవగతియు
గీ. మంజువాక్ప్రౌఢి కంధరామలనినాదసంపదలుగాఁగ సోదరా శాఫలాప్తి
కై రచించెనుబోలుఁగాదన్నఁగలదె యీదృశాంగకబిబ్బోకమెవతెకైన. 181
ఉ. కిన్నరకన్యయో త్రిదివకేసరిమధ్యయొ సాధ్యకాంతయో
పన్నగమత్తకాశినియొ భాసురవేమరమాకుమారని
మ్మన్నజగత్సమీక్ష జయశాసన విస్ఫుర దబ్జగంధియో
యన్నళినాక్షిగాక మనుజాంగన కంటమె తద్విలాసముల్. 182
సీ. ఉరుకాలఘనమౌళిలోకకాలముసఁజాలఁ బలితపాండురరీతిమెలఁగకున్న
నతివేలకీలాలగతిఁమూలకనులీలశైవాలమతిసీల సరవినున్న
నాభీలకాకోలమేలనీలగళగోళమున లోలఘృణిరాజిఁ బూనియున్న
దివిపాలవరశిలసువిశాలకరజాలమునలీలఁతృణచయంబాన కున్నఁ
గీ. బికమదేభకాకవిసరసంకీర్ణసాంద్రాంధకారధ్వాంతలనయమున్న
వన్నెగన్నెకన్నమిన్నపెన్నతికొప్పు కప్పుచొప్పుసాటిఁ జెప్పనొప్పు. 183
ఉ. కంజరుహారికాంతముఖకాంతికి నోడిసమున్నగాఁగనా
సంజలిబాధకోర్చి ఘనసంఘురట్టవిఘట్టితక్రియా
భంజితమేచకాంకుఁడగు భావనరాయుచు నంబువాహరా
జింజరియించె నౌరయటు జెందినఁ దెల్లని ముద్దగాఁడొకో 184
గీ. కుముదములమయ్యెఁ గుముదంబుఁగూర్పలేక నిశకరంబులచేత శోభనుదొఱంగ
నేలయుంచు దపస్సొనరించి యీలతాంగి కనులయ్యెఁబోలుఁ గల్హారయుగళి.
గీ. అంబకోత్ఫుల్లకంజయుగ్మాంతరస్థమధురమకరందపానసంభ్రమవిలోల
చంచరీకంబయుగళంబనంగ జెల్లుఁ గామినీమణితారకాకాంతులెలమి. 186
గీ. నామశోభయెకాని గుణంబులేదటంచుఁ జింతించి యలహిరణ్యప్రసూన
మాసువర్ణప్రతీకనాసాభిరూప్యమందె నామానుకారి గుణాప్తినమరె. 187
కం. కాంతావదనానుపమాచింతన్ సామ్యైతపఃప్రసిద్ధిన్ రజనీ
కాంతుండేతత్కాంతా కాంతాలికమయ్యెఁజిత్రకంబంకముగాన్. 188
కం. కాంతియునౌన్నత్యంబునవంతాధరపాళియందునరయునుహేమా
నంతాధరమొందమ్యెను గాంతాకుచయుగముసాటి కాఁగలవెవియో. 189
గీ. కాంచనాద్రినిఁబూని శంకరుఁడునాఁడు మూఁడుపురములుగూల్చెనిప్పుడులతాంగి
మదనసదనంబులైనమర్మంపుఁగాంచనాద్రియుగమూని నైకలోకాళిగెల్చె.
గీ. కామినీమణిసౌందర్యకంధియౌట భామినీగమనంబు నిభంబునౌట
గ్రాహమటుఁజేరెఁ దద్గజగ్రహణవాంఛదంఘ్రికాకారమూనినిస్సంశయంబు. 191
ఉ. కామినిజంఘలంగని వికారవిషాదభరానతాంగులై
వేములునాఁగులాసి పదివేల తెఱంగులఁ బడ్లురాల్చియు

ద్దామలవిత్రకోణఖరధాటిక్రుషీవల శిఖినంది యి
బ్బ్యాభిమినవామకంబులయిపోయె జుగుప్సను శాలిసంతతుల్. 192

గీ. బెడఁగునిగురులనడుగుదోయడుగుబడఁగ నడఁచినడచునుగడిమివెల్వడఁగదొడఁగి
ప్రపదములుమేటితామేటిపాటిసీటు విరాటిసూటిగ వలిసీటిపాటుఁగూర్చు. 193

గీ. కామినీమణిప్రపదముల్ కాంచినంతఁ గమఠరాజంబు నేతదాకారమయ్యె
శీతలాంభఃప్రవాహవాసితమునగుచు నానుచుండెనుగార్కశ్యమూనియుంట. 194

గీ. సారసాప్తగభస్తిప్రసారసరణి రూపమేర్పడి జడివిద్రుతమ్మునైన
తుణికజీవనసైకతస్థలములెట్లు సాటియానావధూకటీసంపదలకు. 195

గీ. మడఁతినడుమభ్రపదవిభ్రమముగవోయెఁజిరసుహృద్బాల్యదశనెకాంక్షించునట్లు
నారిసొబగారునూగారుసారుటోరినాగులనులాఁగలనుడాగసాగులాగ. 196

చ. అలతరుణీమణీనఖచయామలకోమలపాటలచ్ఛవుల్
దళముగఁబర్వనీర్ష్యమెయి తారలుతారలకాంతిఁజూచుచున్
నిలువఁగలేకఁ బొతి రజనీచరనీచరతిన్ వహించెఁద
జ్జలజవిపత్తికామృతరసంబును గ్రోలి సమత్వమందగా. 197

ఉ. కంబురకంఠమెన్నఁ గనకంబురగాత్రవిలాసమయ్యెకో
కంబురమోవి శైలకటకంబురతత్కటిసీమ శూన్యనా
కంబురకౌను మోహజనకంబురసత్కళవేణి దందశూ
కంబుర మోహనాంగపిటకంబురశంబరజాస్య నెంచఁగాన్. 198

కం. స్మరతేజితసుముఖగములో కరమొప్పఁగనంజకోరఖగములో కాకన్
బురుషాంగకసక్తత్వము నురుమోహనచలనచర్యలూను నెకన్నుల్. 199

కం. చక్రంబులనిజడంబులు వక్రంబులచేయఁజాలువనజాస్య చనుల్
చక్రంబులనిజడంబులు వక్రంబులుసేయఁజాలు వనజాస్య కటుల్. 200

కం. దరభోజ్జ్వలంబుగెల్చును దరళాయతనేత్ర భాసితగ్రీవమునుం
దరభోజ్జ్వలంబుగెల్చును దరళాయతనేత్రభాసితస్ఫుటనఖముల్. 201

కం. కుందమ్ములనందమ్ములఁ జిందమ్ములసేయఁజాలుజెలిదంతమ్ముల్
కెందమ్ముల చందమ్ముల మందమ్ములసేయఁజాలు మగువకరమ్ముల్. 202

చ. పనిగొనియన్నమిన్న కరపంకరుహాకృతి నొందడెందమం
దనయము నెంచిపంచమువరారవకోకిలగానలీనమై
ఘనకచగాఁ దలంచి నిజకాయము చర్వణలీలనిచ్చనే
ర్పునబిసకాండబాహువునఁబుట్టుతలంపునఁ బల్లవంబిలన్. 203

సీ. కంజారియేమోము కాకున్నఁ బీయూషధార లీనెడిమోవిఁదాల్పనేల
గల్వపువ్వులెకండ్లుకాకున్న సంచరద్రోలంబతారకల్గ్రాలనేల
గంధేభమేనడ కాకున్న నున్నతస్తనకుంభయుగళంబుఁదనరనేల
నావర్తమేనాభియుటుగాక నుత్తుంగపులినవ్యయాకటుల్బూననేల

గీ. బాహుయుగళంబు బిసయుగప్రభలెకాకఁ బద్మహస్తయుగంబు గన్పడఁగనేల
నిగురులే కామినీపాదయుగముకాక ముకుళనఖసంచయంబులు మొలువనేల. 204

చ. మరువఁదలంతునన్న నవమానక రాజసరోజబంధురో
త్కరశుకహంసకోకవితతప్రచయంబులు కామినీమణీ
వరముఖనేత్రవేణినిరవద్యగళస్వనయానసత్పయో
ధరముల సాటియౌట నవితాండవమూఁకుచునుండె మెండుగాన్. 205

మ. ఈసుస్వచ్ఛందవిహారవైఖరి నదే యుత్ఫుల్లపంకేరుహాం
తరమాధుర్యమరందపానజనితోద్యద్గానగానక్రియా
పరతం దేలెమధువ్రతేశుఁడహహా ప్రజ్ఞాధురీణాత్ములౌ
నరులక్లేలకో కాంచలేరు విధికృన్న్యాయంబు నాయంబొకో. 206

చ. అనియనివారమారవిశిఖాత్యధికాగ్నినిమగ్నభగ్నహృ
ద్వనజమొలర్ప జంద్రకరవారమవారవికారఘోరవే
దన మొదవింపఁగా నతఁడతంద్రతఁ గన్నులువిప్పి తద్వధూ
ట్యనుపమరూపరేఖల నిరంతర మెంచుచుఁ గుందుచుండఁగాన్. 207

శా. ఆ సంపాంగి చిరత్నరత్ననిచయవ్యాసంగ దేదీప్యవ
త్ప్రాసాదోపరిభాగ సూనవిలసత్పర్యంక వాసావశా
భాసాంగాఖలయై హృదంతరచరత్పంచాస్త్రబాణానలో
ద్భాసాధీరవికారభారవిరహప్రావిర్భవత్ప్రజ్ఞయై. 208

కం. కాంతారసీమఁ గాంచిన కాంతాజనపంచబాణు కాంతాకారా
క్రాంతాత్మాబ్జంబున నేకాంతమునన్ దుర్భరోగ్రకంతుశరార్తిన్. 209

ఉ. కాయముకంపమొందఁ గడకన్నుల వెచ్చనినీరుచింద దీ
ర్ఘాయితనీలకేశచయమప్రగుణత్వముబొంద డెందమం
దాయతకాయజాస్త్రనికరాగ్నులు డిందఁ గడింది వంతనై
నా యలినీలవేణి విరసాకులకాకువికారకంతయై. 210

ఉ. ఇంపుగనిండు నిండ రొనరింపఁగఁ జాలుముఖప్రదీప్తితోఁ
జెంపలఁజారుఁజారు సురశేఖరనీలవిభాలకాళితో
సొంపులకెంపుకెంపుగనుసోయగఁ పున్నఅమోవికీవిన
ర్తింప బెడంగునవ్వు చిగురింపఁ గనంబడెవాఁ డెవండొకో. 211

చ. కనఁగ శరీరకాంతి కనకంబును గంబును గంఠకాంతియున్
దనరెడి కేశరాజి జలదమ్ములఁ దమ్ముల నేత్రయుగ్మమున్
వినుత సుధాలమర్ధశశిబింబము బింబము మోవిడంబునిం
పెసయ జయింపవే నరరతీశుని నీశుభగాత్రుసంగముల్. 212

ఉ. నీరదవాహనీలవరనీలవిలోలమరీచికాతిర
స్కారమనోజ్ఞవక్రదలకప్రకరవ్యటనక్రియాంకవ

చ్ఛారదపూర్ణిమాశశిమలశాత్రవసర్వకళాకలాపసం
స్మారితశన్మఖంబిఁక కౌశసారి కనంగను జంటనోఁచునే. 213

ఉ. ఆ రమణీయవక్త్రజలజారి విలాసము నాఁడెదంగుటో
య్యారవు వాలుఁజూపు విరివందు వెడంద యెడంద దంబునిం
పారుకపోలకాంతి కరపంకజమార్దవ మెన్న మానిబృం
దారకులందు నున్నవిబుధప్రకరంబులయందె లేనిచో౯. 214

మ. అలికాపాప్రతిమానభీమదమునోద్యత్కాల భస్మీకృతో
జ్జ్వలితాకారురమాకుమారు గనియాశంభుండు శంభత్కృపా
కలితుండై మదనాతిరేకలలితాకారాంగు వీనిం ధరా
స్థలి సృష్టించెను బోలునక్కటఁ తి విధ్వస్తంబుఁ గావింపఁగా. 215

శా. వాపింగాంచిన యంతనుండియు రమావామాకుమారాస్త్రసం
తానార్పిమ్మదమేయకీలలు మనో నాళీక సంతాపసం
ధానానూనవియాతఘోరములునై దర్పంలబెర్వ౯ నిదా
ఘానేహోర్కమరీచిరాజి కుముదంబట్లం బ్రవీసించెడి౯. 216

వ. అనితక్కాంతాకరసీమాదృష్ట బసవేశ్వరార్పిత మానసాంభోజయై 217

ఉ. దంభము చెంగలింప నిశితప్రదరంబులనేయుమారసం
రంభవిజృంభణంబున కరాళగతిన్ వ్యథఁజెంది తానుపా
లంభణ విప్రలాపముల రాజనిభానన సూనబాణుడు
జృంభిత కోపతాపములఁ జీరిపచించెను గద్గదధ్వనిన్. 218

కం. ఏలామారుఁడ యిప్విధి బాలారత్నములనేఁచి పాపముఁగొనఁగా
మేలా యిక్కట్క్రముదుశ్శీలా యిప్పనియు నొక్క చేవయెకూళా. 219

చ. స్మర! విమజంబు లీకగును సాయకముల్ మధుపాన మత్తబం
భరములునారి సస్యపరివారవిభూతి శుకంబు తేరునిం
కరయనిశాచరుండె యగు నాప్పుఁడు పల్లవలాలసుల్ చమూ
వరులు కలుంగునే సుగుణవర్తన శంబరహర్త నీకిల౯. 220

సీ. రాత్రివేళల శరీరచ్ఛాయ కానరాకుండ సాలావళి నొదిగి యొదిగి
జాగరూకత పాంథసంచయంబులఁగాంచి సాధనంబుల బిట్టు బాధఁగూర్చి
యెలమి నాత్మధనంబు నిలువరించి హరించి మిత్త్రాళి సంపర్కమహిమఁ జెలఁగి
యతినీచపశ్యతోహరవృత్తిఁజరియించు నీకెట్లు సద్గుణానీకమబ్బు

గీ. ధరణి నొక్కొకవేళనబ్బురి మహీశదండనంబంది పాపవిధ్వస్తుఁడగును
గాని రాజశిక్షయలేని కాము నీ యనంత పాపంబులెట్లు బాయంగఁ గలవు. 221

గీ. కృతకకన్యక యగు తండ్రినే కడంగి పూవుటమ్ములు గ్రుచ్చి శంభుని వరింపఁ
జేసినాఁడవు మాబోంట్ల గాసి పెట్టుటబ్బురంబౌనె మదన ఘోరాఘసదన. 222

సీ. మేనకాసురవధూమిషను విశ్వామిత్రు సత్తపోభగ్నంబు సల్పునాఁడు
సామాన్యమనుజాజ్ఞకామినీపోత్వ్రత్తిచే ఋశ్యశృంగము నింద్రుఁ జేయునాఁడుఁ
బుత్త్రికారతివాంఛఁబుట్టింప శతపత్రపుత్త్రిపై సుమపత్త్రిఁబూనునాఁడు
దారుకాననమౌనిదారవారమనోరవిందాళికెగ్గుగావించునాఁడు
గీ. వారువారైనఁగని దుర్నివార్య ఘోరశాపరోపంబులను నిన్నుఁ జంపరైరి
కాముకీకాముకానీకకాంతచిత్తపద్మదళనప్రవీణ యోపంచబాణ 223
గీ. అద్దుసుతుఁగూర్చి భార్య నోదార్పవానినిభముఖునిఁ జేయవలసెనంచెంచిబోలు
హరియునొకసారిభార్యయైనంతమాత్రహరుఁడునినుగూల్చి గాచెఁగంసారిపుత్త్ర 224
గీ. అతివలు చలింపఁగారణంబైననిన్నుజంపి ప్రబతికించెనేల నీశ్వరుఁడటంచు
దారువని మౌనులతని పైదాడిసల్పి రట్టులౌగాదె కూళలవాదరింప. 225
చ. అని పలుమాఱు మారుఁదనయుల్లుని పెల్లుగనిందసేయనా
త్మజుగన లేక పాంథజనతాపరితాపసతాభినాయకో
ద్ఘనశరకాండమండిత విధానశశాంకుఁ డెమర్పఁగాంచి స
మ్మనమునఁ బ్రసుక్కి వానిఁగని మానిని రోషవిభీషణాకృతిన్. 226
ఉ. ఔరకళంకి యిద్దితగవా విషమాస్త్రుని గూడివేఁడి పా
ల్పారుకరంబు లిట్లువిరహాతురకాతరకామినీమణీ
వారము నేచ నీకు పగవారమె కైరవనేత్రలంచునీ
వారయవేమిరా జలరుహానన శోషణచక్రభీషణా. 227
సీ. సోమనామఖ్యాతి శోభనొందెదుకాని హరికృతాహిగ్రాసలరినావె
విధుసమాఖ్యప్రాప్తి వెలయిఁగెదుకాని పద్మాకరక్తిఁ గప్పఁజాచినావె
జైవాతృకాభిఖ్య సంభ్రమించెదుగాని నెలయైనఁ బూర్తిగానిలచినావె
శుభ్రధామఖ్యాతి విభ్రమించెదుకాని యంకపొంకంబింకనడఁచినావె
గీ. తత్పదార్థంబులరయసిద్ధరణియందు జంబుకస్తబ్ధరోమ కదంబమౌక
ళిబకసంతతికిని సమర్థింపఁబడవె యాఖ్యమాత్రపవిత్ర దుగ్ధాబ్ధిపుత్ర 228
ఉ. కంధికిభంగపాటు నలకాండరుహాళికి భంగపాటు శ్రీ
సింధురయాన శాలకును జేటుగలుంగఁగ జేసిగోత్రసం
బంధవిరోధమూనునినుమార్కొని శిక్షయొనర్పఁగాఁగదా
బంధురతేజుఁ డగ్రజుఁడు పావకుఁడే నిను మున్ను ద్రుంగెడున్. 229
గీ. గురువరారోహరత మహాఘోరచర్య సల్పి కరుణాబ్ధియగు నద్రిజాహృదీశు
ఘనజటాజూటమూనమై యునఁగినావు చిక్కియుండినగురుఁడు శాసింపకున్న 230
చ. స్వయముఁగ వెల్గుశక్తిగవఁ జాలకసారసిపి సుహృద్ఘృణీ
చయములరూపమందియల సారసవర్గమునే దహింపన
వ్యయకరకీలికీలలనివారతరక్రియఁగూర్చుచుంటిని
ర్దయుతనునైజమేకద కృతఘ్నులకెందున కానికర్జముల్. 221

ఉ. నీసహజంబులందు ధరణీజశిలాదితతుల్ వసింపఁగో
ల్లాసవరప్రదాయు కళావహనాప్తి యశస్వులయ్యెనా
శ్రీసతిలోకమాతయును చెన్నువహించెమహాసవవ్రజ
గ్రాసనివిష్టుఁడయ్యెశిఖి కాంచఁగశంకివినీవెయబ్జుఁడా 232
సీ. శ్వశురపత్నీస్మయధ్వంస కార్యాధీనశీర్షమువిధిఁ బ్రవేశించినావు
త్వత్కృతవ్యాజక్రు ధాళాపదాయకుండైన హేరంబునట్లానినావు
పంకజాతుండైన పద్మాలయానేత్రనేత్రవీథిన దెట్లు నిల్చినావు
అంబుజాసనురాణియైన భాషావధూవేణి నీమున దెట్లు వెల్గినావు
గీ. దేవదేవులటంచు భక్తిని భజించివారి కృపఁజెందిగన్మహోధారశక్తి
విరహులనువేఁచ వెసలుదేసరసిజారి భూధవాశ్రితఘోరదుష్పురుషుఁబోలి 233
సీ. కుముదంబులకె కించుగుణముఁ గల్గెడినీవుఁ గుముదంబుచే నెప్డుఁగూలఁగలవొ
గురుభంగపాటుచే కూర్పఁజూచెడినీవు గురుభంగపాటునే కరణిఁగనుదో
యబ్జబాధాకరం బభిలషించెదినీవు నబ్జబాధాకరం బౌను దెపుడో
యరి నాగముల నొంచఁబరితోఁపినీవెన్నఁడరి నాగబాధచేనలయఁగలవో
గీ. కమనదమనాతిరేకముష్టగకర ప్రతానకీలావితానవిధ్వంసహేతు
వారిధారావిధాన దుర్వారఘోర పీడలెప్పుడానునోర్నున్న బీరముడుప 234
చ. అనితోగతేని చండకిరణానలతాప మహోద్ధతవ్యథా
జనితక్రుధన్ వచింప నతిసాంద్రపటీరధరాధరాధిరా
జనికటగంధ.బంధుర విశాలసరస్సరసీరుహాసవా
త్యనుపమసౌరభాన్విత దరాసిలమూనెలఁతం బెసంగొనన్ 235
కం. ఏపారువాత బాధావ్యాపారము సైఁపలేకనంగనకోపా
కూపారత్వవ్యంజిత తాపారభటీ విశాలతావిధిఁ బల్కెన్ 236
కం. శ్వసనా మధుసంగ్రహణ వ్యసనాదశనాంగరాత్తభయదవిషాహి
గ్రసనా కాముకపీడాభ్యసనా నన్నేలనిట్లు బాధింపంగన్ 237
గీ. సురలు నిత్యంబుఁ దినుచున్నఁదరుఁగడిందుఁడభవు కంగి త్రిమాసిమాయుండనంగు
డహులు లెగ్రమింగుచున్ననివడఁగిపోవుమూవు రేకగ్రహంబునఁబొడమిరొక్కొ 238
సీ. విశ్వవిశ్వంభరావిధ్వంస కోపర్బధార్చి ర్వ్రజంబుఁ బెంపందఁజేయు
సకలజీవికదంబసంత్రాసకర ఫణివ్యూహాంబునకుఁ దిండినొసఁగిపెంప
నమృతఫలప్రదాయక మహాగమకోటిమూలంబులను మంటిపాలుసేయు
నఖిలజీవనదవిఖ్యాత జీవనదంబులను మింటిత్రోవఁ దూలంగఁజేయు
గీ. నలిగి కాఁబోలు సర్వలోకాధినేత ప్రాణమాత్రునిఁజేసి కాయంబుగూల్చె
నట్టులయ్యును మానవయ్యయ్యొ పుణ్యభూజనులకెగ్గుఁజేయు దుర్బుద్ధిపవన. 239
గీ. ఎల్లజగములఁగాల్చు స్నేహితుండు చెడ్డదారివారింప జూచవంతటను బోక
సారెవారింపవచ్చెడి వారిఁగూడఁ దఱుముచున్నావ దెంత నిర్దయుఁడవనిల 240

చ. అనిపరితాప వహ్నిభరమంతకునంతకు వృద్ధినొందఁగా
వనరుహబాణశీతకర వాతకుమారుల నిందసల్పుచే
తనము చలింపఁగా హృదయదార్ఢ్యము వాయఁగ దేహవల్లికం
పనము వహింపఁగా నపుడు భామిని మూర్ఛను వ్రాలె భూస్థలిన్ 241

వ. అయ్యవసరంబున

ఉ. అంబరభాండ గేహమునయంబు నవింపఁగ సూర్యచంద్రబిం
బంబులఁగాలనేత నియమంబున నిల్పితదీయబేఫకా
లంబులఁ దెల్పఁగా నిడిన లాంఛనమన్విధి వేగుఁజుక్కనా
కంబున వొల్పెనబ్జు డొడికంబున వెల్వెల వారిపాఱగా 242

మ. సకలామ్నాయశిరోగ్రనర్తిత యశస్సాంద్రీప్త పీయూషరు
క్షకలాలంకృత ఫాలువాహ మనుజాకారంబు కళ్యాణవే
దికనొక్కన్ గుహసద్ద్విజంబులు మునీంద్రిక్వానుర క్రిందయీ
ప్రకటధ్యానము సేతు మన్విధమునందోఁ గంగూసెఁ బచ్చస్రిముల్. 243

వ. అత్తఱింజెలికత్తియ యొత్తంబుఁబ్బి తత్ వృత్తంబెఱింగి తత్తరపాటు
చిత్తంబుల రేకెత్త శిశిరోపచారంబులొనర్చి యక్కన్యం బునర్లబ్ధచైతన్యనొ
నర్చి గాఱియు నచ్చెలంగాంచి. 244

ఉ; ఒప్పులకుప్పరో పధికునొక్కని చక్కనివాని వాలుఁగన్
ఱెప్పలనెత్తి చూచితివొ లేదొ దురంతలతాంత బాణికిన్
దెప్పరమైనముప్పులకు దేహమునొడ్డితివయ్యొ యీవిధం
బొప్పునె యెన్నఁడైనకని యంటిమొ వింటిమొ యిట్టిపోఁడుముల్. 245

శా. కన్యాలోకనవీన మన్మథుఁడగుంగాకేమి యామాత్రలో
సన్యస్తాఖిలచిత్తపాటవికవై సంతప్తసర్వాంగవై
వన్యాంతఃపికశారికా శుకముఖస్వాన క్రియాభుగ్నవై
మన్యుక్రేకతఁ బొక్కనేల నతిరామాలోక సౌందర్యవై. 246

చ. నెలఁతిరొ వాఁడు వచ్చెఁగదనీ జనకానుగుఁడై యిఁకేలఁగొం
దలమునఁ బొక్కవానిచరితంబు సమగ్రమెఱుంగవచ్చు భూ
వలయ వధూజనాళి నిరవద్యమనోజ్ఞ విలాసరూపసం
కలితవు నిన్నువాఁడుఁగని కంతుశరాళి విరాళినొందఁడే. 247

ఉ. వేగిరపాటఁ గేలఁగను విప్పుమ దేశశి ప్రాగ్ధరోపకం
తాగతుఁడయ్యె నవ్యనళినాప్తుఁడు వొల్చినసర్వకార్యముల్
బాగుగునంతదన్క నలపంజర సేకిత కీరరాడ్గురూ
ద్యోగము బూని పేశలవచోత్కర మింపుదలిర్ప నేర్పవే 248

చ. ఇనరహితాంధకారసమయైధిత వృత్తిసమస్తచక్రవే
దనమురలీలఁ గూర్చికుముదంబు వెలుంగఁగ జేసితంచు న

య్యానుఁడరుణాస్యుఁడైనను వధింప నదే చను డెంచునంచుఁదాఁ
జనియెదు గంటివే యలనిశాచరు బంధుఁ గపాండిమూకరున్. 249

మ. కమలాగారనిబద్ధనాయకదిదృక్షావ్యగ్రరోలంబిత
ద్విమలగ్రీవవిపర్యయస్వనవిధాదీవ్యద్వియోగవ్యథా
క్రమముం దెల్లముసేయఁగానదె దళద్రాజీవముక్తాళిత
ద్రమణింగూడెను భావితావక శుభోదర్కక్రియాబోధియై 250

కం. తెలతెలవాఱెను గుతలముఁ గలకల కలరవము వికిరకాండముసల్పెన్
వెలవెలవాఱెను గల్వలుఁ జెలిరో యొకనిమిష మోర్పుజెంద వెయనుచున్. 251

కం. పొదవుచురవిబింబములో నుదయము బ్రహ్మస్వరూప ముంతునటంచున్
విదితంబుసేయఁ దక్కక సదమలమై తొంటి సంజచందముఁ దాల్చెన్. 252

ఉ. శర్వరియన్ దురంతమదసామజకోణపరాజఘోరదు
ర్గర్వనివారశాగ్నికణకాండపరిస్ఫుటదిష్టభద్రగం
ధర్వలలాటలోచనమునన్ ఖరభానుసహస్రదీప్తి స
ప్తార్చుఁడు మించెఁ బూర్వకకుబంబుధిసీమజనోత్సవంబుగాన్. 253

ఉ. ఆ బలదేవనాయకుఁ డనంత ముదంబున భాగినేయుఁడౌ
నా బసవన్న వృత్తమవుడాత్మజకుం దెలుపంగవోయితా
నాబిసజాక్షిరీతి నవలాలులు తెల్పనెఱింగి యుబ్బి యే
మీ బసవార్యుఁ గూర్మి కృతకృత్యుఁడ నైతి సిఁకేమికావలెన్. 254

కం. వాంఛితసిద్ధిఘటిల్లె నుదంచన్మోదాప్తి నాకతాళీయుమగాఁ
బంచాస్త్రతుల్యు వీని వరించెన్ మత్పుత్రి సచ్చరిత్రుఁడ నైతిన్. 255

మ. నతిసంరంభసమాగతాఖిలసుధాంధఃకాంత మూర్ధావలీ
స్థితరాజన్మకుటాగ్ర శోభితమణీదీవ్యద్ఘృణీఘుట్టితా
ప్రతిమానాంఘ్రిసరోజలింగమొదపై రాజిల్ల దుస్సాధ్య వాం
ఛిత పుంజంబులుఁ గల్గునే కనుఁగొనం జింతాభరంబుండునే. 256

చ. అని తలఁపోసి వ్రీడ వదనాబ్జము నల్లన వాంచి గాంచున
య్యనుఁగుఁ గుమారిఁగాంచి దుహితా మది నేటికి సిగ్గునొంద న
య్యనఘుని వేఁడి సింబరిణయంబొనరించెదఁ జింత దక్కుమా
యని బసవన్నఁజేరి వినయాకృతి నాతనితోడ నిట్లనున్. 257

ఉ. శారదపూర్ణిమాస్ఫురితచారుకళానిధి మోహనాస్య సం
పూరితషోడశాబ్దయగు పుత్రిక యొక్కతె కల్గునాకు త
స్నీరదమాలికారుచిరనీలశిరోజను వీరశాంభవా
చారవిదూర హేయ భవిసంతతికీయని దీక్షనూనుటన్. 258

ఉ. విష్టపకాహానాంగుఁడతివేల శివావరలింగ సేవనో
త్కృష్టవిచారచిత్తుఁడగు ధీరవరుండవఁడొక్క భామినా

దృష్టికిగోచరించునని యిచ్ఛలు రోయుచునుండ మామకా
దృష్టఫలంబునాఁగ భవదీయ గురుండును బిల్వఁ జేయుడున్. 259

ఉ. వాళినితావకోపనయనామలకార్యముఁ జూడవచ్చి హే
లాలయసత్ప్రతీకభవదాకృతిఁగాంచి మహాముదాబ్ధిలోఁ
దేలుచు నిన్ను వేఁడెనమదీర్ఘతమత్ప్రుతఁ బెండ్లిసేయఁగాఁ
జాలఁదలంచి యిట్టోడలిసాగు నినుంగొని తెచ్చి వచ్చితిన్. 260

ఉ. అంతియకాకనోయి సహజాత్మజ మత్ప్రియపుత్రి సత్ప్రభా
వంతధరాజరాజపరివారవిభాసిత కేళికావన
ప్రాంతవిహారవేళనవరాజనిభామలతావకానన
క్రాంతచకోరనేత్రయయి కాంచివరించెను జైత్రికంబుగాన్. 261

మ. భగినీపుత్రుఁడ వౌట నింత చనవొప్పన్ వేఁడుచున్నాఁడ మే
ర్వగ ధానుష్కుఁడు శీతభూధరసుతాహస్తంబుఁ జేఁబట్టు రీ
తిగ మత్పుత్రి వివాహమాడి ఫలితార్థిన్నన్ను జేయంగదే
మ్మృగితేశానపదాబ్జనిర్మలమధూన్మేషాళినాథాయనన్. 262

శా. తత్పత్నీరఘటాత్తశంబరవిధిందద్వాక్యముల్ సోఁకసం
తృప్తుండై బసవన్న మార్గితలసద్దేమంబు హస్తాంబుజ
ప్రాప్తంబైనటు లాత్మమెచ్చి నిజభావంబిచ్చి సూరీకృత
క్లుప్తన్యాత్రిని సంతనాతఁడు మనఃకూటంబు రంజిల్లఁగా. 263

సీ. గంగాంబుజోత్కరభృంగాంగనిభకరత్కల్మషుండు నిరస్తకల్మషుండు
వందారుసురశీర్షమందారసుమవర్షపాదకుండతిమందపాదకుండు
పద్మాసనార్చితపద్మాంఘ్రియుగళిస్తమాషుగుండసురాగమాషుగుండు
వాణీభుజగకాంతవేణీశ్వరకపాలభావితుండఖిలర్షిభావితుండు

గీ. శంభుఁడరిదంభశుంభదస్తంభ కేళిజృంభణారంభసంస్తంభనాంభసుండు
శుభకరాపాంగమొత్తినంజూచెనింక నేమికావలె వాంఛ సిద్ధించెననుచు. 264

చ. ఇటుబలదేవుఁడాత్మఁ గృతకృత్యుఁడుగాఁదలఁపోసికొంచు ది
క్పటుపటుభక్తచంద్రపరివారము నెల్లర బిల్వఁజేసి యి
ప్పటుమణి చెల్లికుట్టి బసవన్నకు మత్సుతనిత్తుఁగానవి
స్ఫుటమతిసన్మహార్తమతి సువ్రతులార వచించిపోవరే. 265

వ. అని ప్రార్థించుటయు వర్గణాధీశ్వరులు. 266

చ. అసమశిలీముఖారిచరణాబ్జవినిష్ఠితచిత్తవర్తనా
భ్యసనులకేల నయ్యెడు శశాంకగతుల్ బలదేవనాయకా
మసలక తత్క్షణంబె సురసుందలమానితరీతిఁ బెండ్లిసం
తసమునఁ జేయుమన్న వనితాతతికాతఁడు నాజ్ఞసేయుఁడున్. 267

కం. గంగాంబికావధూటిని శృంగారముగా నలంకరించియు రూపా
నంగుని బసవాఖ్యానను సింగారముసేసిరంత సితపద్మాక్షుల్. 268

సీ. తనయశంబాజగత్పావని స్ఫురితంబునా నాగ్రతలి ప్రశస్తి మెఱయఁ
దనమతంబఖిలమూర్ధస్థానముం దనా రుద్రాక్షశీర్షాభిరూప్యమమరఁ
దనతేజమలబృహద్భానుతుల్యంబునాఁ గాషాయవస్త్రప్రకాశమలరఁ
దనఫాలమర్ధామృతమరీచి నిరసించునా భాసితంబు దంబారు మెండఁ

గీ. బూర్ణచంద్రునిఁ దెగడు నెమ్మోము నందుఁ బండువెన్నెలజిగిడాలు బరిహసించు
బరిహాసనశోభకన్నులపండువౌనఁగ భంజితానంగమూర్తియై ప్రభదలిర్ప. 269

ఉ. గ్రామనివాసశైవగణకాండసమన్కరణానురక్తి జి
త్కామవిలాసుఁడబ్బసవధన్యుఁడు వోవ నెఱింగి తత్పురీ
శ్యామలనూనమోదహృదయాబ్జములంబరికింపసాగిరు
ద్దామమనోజశాతశరతాడిత లౌచుగృహాంగణంబులన్. 270

ఉ. నాథుఁడుగాంచకుండ నొకనారివినిర్మలదర్పణంబుఁద
త్సౌధమునుంచ నబ్బసవసత్ప్రతిబింబము పొల్చిమాత్రలో
వేధితమౌచుఁ దద్హృదయవీథిసమగ్రతనాక్రమించి బా
ధాధికహింసఁజేసె నికనాకృతిఁగాంచిన కాంతయోర్చునే. 271

శా. వారాపూర్ణఘటస్థమూర్ధయగుచున్ వామాలలామోత్తర
న్మారాకారుఁగాంచినంత వెనుకైనం ద్రిప్పి శీర్షంబుత
న్నారామ్రతమఁజాతౌ నర్పితమనోనీరేజధానక్రియా
ధారాసూచకమౌచు సజ్జనములోఁ దత్కాంతలజ్జింపఁగన్. 272

ఉ. తానమొనర్చివచ్చి పరిధానముఁగట్టుచునాత్మతేజుఁడౌ
వానినొకర్తుగాంచి నిరవద్యతదాకృతిచిత్తవీధిసం
దానితమైనఁజిక్కి నిఁకదాఁటఁగలాఁడెయటంచు బేలయై
పీనకుచద్వయంబుబిగఁబెట్టి ధరించెను గంచుకంబొగిన్. 273

ఉ. జాలకశుంభపంథనొకచానవిజాలకజాలమున్ గొన
వ్రేలనుదువ్వుచున్ గనియె విభ్రమవీక్షణవానినంతను
ద్వేలకరాళమారశరవేగనివృత్తమనోజ్ఞధైర్యయై
తూలె దురూహిణీజనవిధూననమూర్తియు వానిమర్వినాన్. 274

ఉ. బాలికతోడ వేడ్కనొకప్రౌఢమనోహరకందుకోల్లస
త్ఖేలననుండి రూపజితకీరతురంగునివానిగాంచిత
ల్లోలతనున్న బాలకరలుప్తమహోద్ధతగేంధుకోగ్రసం
చాలన యొమ్మువాయు నగసాగెను బాలికహేలనాక్రియన్. 275

చ. ఒకవనితామతల్లి తలుపోరననిల్చి మహామహోల్లస
ప్రకటుని గాంచి భక్తినిజభావమునం బ్రభవింపఁగాలిమా
లకతలబద్ధపాణియుగళక్రియ మ్రొక్కె నదట్టిదే దురా
త్మకులు దురర్థమున్ సుజనతండము స్వర్థము నెన్నఁజూచుటల్. 276

కం. ఈ కరణిఁబౌరకామినులాకాంక్షంగనుచు నుండ నబ్బసవఁడుఁద
చ్ఛ్రీకంఠ భక్తపదనాళీకములకు నెఱఁగి కందళించెడి భక్తిన్. 277

కం. కళ్యాణవేదిఁజేరఁగఁ గళ్యాణులు కొందఱేఁగి గంగాంబికమాం
గళ్యంబుగ నీశ్వరభక్తాళ్యంఘ్రుల కెఱఁగఁజేయునంతట వారల్. 278

ఉ. ఆ నవమోహనాంగి బసవన్నలఁదోకొని దద్గృహాంతరే
శానని దేశమందునఁ బ్రజానివహంబులు సన్నుతింపన
న్మానినికంబు కంఠమున మంగళసూత్రముఁగట్టఁజేసి రు
ద్ధీనిధియైన యబ్బసవధీరునిచే శివమంత్రవాచ్యులై. 279

క. ఈగతిఁగృతపరిణయుఁడై నాగేంద్రకలాపుసప్తి నందీశ్వరుఁడా
నాగేంద్రహారణు సమ్మదనాగేంద్రకరోరకులిసుఁడనిటువొగడెన్. 280

తరలి. దానవనవదానవన వధానవరతపావకా
ధీనవహన దీనవహనదీనవరదయాత్మకా
భానువిశదభాను విశదభాను విలసితాంబకా
మానసహితమానసహితమానవజనరక్షకా. 281

పంచ. ధరాధరాధిరాట్సుతాయుతప్రసూనబాణసం
హరాదరాదరామృతాచ్ఛతానవాభరమ్య భా
సురాసురాసురార్చ్య మానశోభితాంఘ్రిపద్మకం
కరాకరాకరాబ్జ పావకత్రయాత్తరక్షకా. 282

—: దండకము :—

శ్రీమన్మృడానీశ! లోకేశమేశా మరేశాది బర్హిర్ముఖానీకమూర్ధస్థితోద్య
త్కిరీటాగ్ర సంభాసి రత్నచ్ఛటా స్నిగ్ధహేలాగభస్తి స్ఫురద్వాహినీ కృత్రిమాంభః
కణక్షాళితాంఘ్రి ద్వయీ సాంద్రపాంసుప్రజా! భీమ కాంతార వహ్న్యుద్ధితో
ద్వేల కీలాతిరేకోగ్ర ఫాలాంబకప్రోద్గతాసహ్య తీక్ష్ణజ్వల త్పావకార్చిర్మహో
విగ్రహీకృత్యసరోజాస్త్ర భస్మ ప్రదీప్తాంగరాగా! విరాగా! సురాగా! నమల్లోకపాలీ
సురాగా! మహామ్నాయ పుష్పావలీ సత్పరాగా! కలంబాసనీకృత్పవిత్రామరాగా
మరీర్ష్యాస్మయోద్రేక దక్ష ప్రజానాథ కృద్దుస్సవాహూయమాన క్రియా
యాతహవ్యాశనేచ్ఛాక సర్వర్భుసంసజ్జిగీషాభిలాషా భృతాభీల సంవర్తవేళా
సముజ్జృంభణోన్నిద్రరౌద్ర స్వరూపా! విరూపాక్ష! నీరూప! ఉల్లోల కల్లోల
వల్గద్ఝషానీకి కాభ్రాపగా పూరిత పాథోర్ద్రి శీర్ష స్థలీసర్పితాళీ విపక్షేష! నిష్టా
గరిష్ఠరి శిష్టాన్వవాః కృత్య సంప్రీణితాత్మాబ్జ! తంతస్య మానాహి ఖట్వాంగ
సారంగ సారంగ భృత్తుండ సారంగ శార్దూల చర్మాంశుకోగ్ర త్రిశూలేంది
రానాథ కంకాలవేధః కరోటిస్ఫురద్ధస్త! విధ్వస్త రాత్రించరానీక సంఘాత!
దుగ్ధాంబురాశ్యుద్భవ ద్ఘోర దీవ్య ద్విషజ్వాలజంబూ ఫల ప్రక్రియా సంస్థిత గ్రీవ
కార్బుర్య! దేవాతివర్యా! యనూహ్యోచ్ఛకార్యా! నిరస్తోగ్రవైకార్య! యుష్మ
న్మహాకార సందర్శిత జ్ఞాని పీయూష భుగ్వ్యాప్త పాంతర్లసన్నందనారామ మధ్యస్థ
మందార భూమీరుహచ్ఛాయ రంభా వధూశాతకుంభో జ్జ్వలత్కుంభ పీన స్తన
ద్వంద్వసంలగ్న కస్తూరికా శస్త గంధాతతోరః పుటోద్భాసియై శక్ర కృద్వంద
నార్ఘ్యాదిపూజా ప్రతుష్టాంత రంగుండునై పోయి వైకుంఠ లోకాదరోత్సేధ మార్గాట
నోద్వృత్తి కైలాస భూమీధరాభ్యర్ణ సౌందర్య దృశ్యావళీ వర్ణనాలోల నిర్వర్ణనా
నందినై నందివాహుండు నీరీహుండు శరచ్చంద్రికాదేహు సజ్జాత షండేహు నిర్మోహు
సాయుజ్య సంప్రాప్తుఁడై మించునో భర్గ! మిశ్రీభవద్దుర్గ! నిత్యాపవద్దుర్గ! నిర్బంధురీ
భూత మద్వర్గ! తాపత్రయోద్యద్గభీరాబ్ధి నిర్మగ్న భుగ్న క్రియా ఖుల్లకీ భూత
చేతస్కుఁడన్ నీచవర్చస్కుఁడన్ నిన్ను గీర్తింప శక్తుండనే సత్కృపాస్నేమదృష్టి
న్వీలోకించి మజ్జన్మ సార్థంబుగాఁ జేసి యస్మత్కృతైనస్సమూహంబు శాసించి
రక్షింపుమో యీశ! పాలింపుమో శర్వ! కాస్వద్వికుర్వాణ నిర్వాణ సంధాయకా
యంచునెప్పుడు నిన్వేఁడెదన్ సాంబ శీతాద్రిజామాత కంజాత సంజాత నూతా
నమస్తే నమస్తే నమః. 283

ఉ. పంచినభక్తినిట్లు పురభంజను నీశ్వరు సంస్తుతించి గం
గాంబిక గొల్చుచుండ నిలనైక సహస్రసమంబులుండి కై
వంబుసముద్ధరించి జనవర్గముదంబడఁగించి సర్వలో
కంబులు సన్నుతింప శితికంధరుఁ జేరెఁ బురావిధంబునన్. 284

ఉ. ఈసుచరిత్రభక్తిపఠియించిన విన్నలిఖించినన్ మహో
ల్లాసవిభావసౌఖ్యధనలాభయశోయురభీష్టసిద్ధులు
ద్భాసిదయాకటాక్ష పరిపాటి నొసంగుచునుండు గల్గుబ
ల్దోసపుమోములం గూర్మియును దోయధివీచులలో నడంపురా. 285

—: ఆశ్వాసాంతము :—

క. శాశాహీశాప్మ్రుత నీశాశాజప్రస్వయంప్రకాశా కేశా
శాశాసజ్జన త్రైశాశాకీనాశనాశ శాశాపేశా. 286

శా. గంగాతుంగతరంగరంగవిలసద్గాంగేయపద్మచ్ఛటా
భృంగీభృంగపచంగ సంగరగళద్విస్ఫారకింజల్కభా
స్వృంగారైతవిధీభవజలప్లుతిస్ఫారకావకభృత్తతో
త్తుంగప్రాంతనితాంతకర్కశశిలాదుర్ధర్షలాస్యప్రియా. 287

—: కవిరాజ విరాజితము :—

కరధృత శంబర గాఢదిశాంబర కంపిత శంబర భవ్యశిరా
వరచికురాంబర వారిత శంబరవైరి మహాంబరతిప్రముదా
మురహర సాధన పూత్త్రయ సాధన మూర్ఖవిబాధన భూతిధనా
పరమకిషోదన పంకనిషూదన భక్తవినోదన శేషగుణా. 288

గద్య. ఇది శ్రీమత్కామాక్షీకృపాకటాక్ష లబ్ధ సహజకవితా విలాస విశ్వబ్రాహ్మణాన్వయ దిత్యసేనసూత్రతార్క్ష్యంతగోత్ర కట్టికులపవిత్ర వీరేశలింగాచారి పుత్త్ర భీమలింగాచారి నామధేయ ప్రణీతంబైన బసవేశ్వర కల్యాణంబను నేకాశ్వాస ప్రబంధంబునందు సర్వము సంపూర్ణము.

శివార్పితమ్

